# మీరూ - నేనూ

(కథల సంపుటి)

రచన:
దరిశి చెంచయ్య

నవోదయ పబ్లిషర్సు
విజయవాడ-2

# ఒక మాట

ఇది ఒక సాహసకార్యము. కథలు వ్రాస్తానని అనుకోలేదు. ఆలాంటి పనికి అభ్యాసమూ చెయ్యలేదు.

షుమారు 60 సంవత్సరముల వయసు రాగానే, బలహీనత, ముసలితనము, అనారోగ్యము బాధించడం ప్రారంభించాయి. ఇక కష్ట మైన పనులు సాధ్యపడవని తీర్మానించుకొని, ప్రజా ఉద్యమాలను మానుకొని, జీవితాన్ని శాంతంగా గడపడం ప్రారంభించాను.

అదివరకు నేను చదువని విషయాలను గురించి చదువడం ప్రారంభించాను. వాటిలో ఒకటి కథలు చదవడం; ముఖ్యంగా యింగ్లీ షులో ఎన్నో చదివాను. కొందరు రచయితల రచనాకౌశల్యం నాకు ఎంతో నచ్చింది. వారి భాషాజ్ఞానంకూడ బాగా ఉంది. కాని, కథావస్తు వులు అంతగా మెచ్చుకో తగినవిగా తోచలేదు; చిల్లరవిషయాలు నాకు నచ్చవు.

వారు వ్రాసిన విషయాలకంటె ఎక్కువ మంచివి, అనగా, ప్రజ లకు ఉపయోగపడగలిగినవి నాకు ఎన్నో తెలుసునని భావించాను. అయితే వ్రాసే శైలి, భాషాజ్ఞానము, అభ్యాసము నాకు లేనందున నిరుత్సాహ పడ్డాను. ఈలాంటి ఆలోచనలు బాధ పెడుతున్న కాలంలో, కథలను వ్రాసే కళను గురించి ఒక వ్యాసాన్ని చదవడం తటస్థించింది. బాగా తెలిసిన విషయాలను గురించి మాత్రమే వ్రాయవలసిందని. ప్రతిమనిషి జీవితంలోను ఒక మూలసూత్రము, ఒక జీవిత లక్ష్యము ఉంటుందని, దానికి కారణాల్ని బాగా గ్రహించుకొని కథలు వ్రాయవలసిందని, చక్కని

సలహా యిచ్చుటేగాక, ప్రతి వ్యక్తి కథలు వ్రాయగలడు అన్న ధైర్యాన్ని ఆ వ్యాసంనాకు కల్గించింది. అంతట నేను. నాకు బాగా తెలిసినవారి జీవితాలలోని ముఖ్యకారణాలను తెలిసికొనుటకు ప్రారంభించాను.

అయితే వ్రాసే అభ్యాసము లేనందున నా వ్రాతలను ప్రచురించేవారుండరని, వ్రాయకూడదని తీర్మానించుకొన్నాను, తెలుగులో కొన్ని కథలు చాల అద్భుతంగా వుండడం, అప్పటికి తెలుసుకొన్నాను. అయితే అవి చాలవరకు కల్పితకథలే. నా కథలు వాస్తవమైనవిగా వుండాలి. కాబట్టి వ్రాయడం ఎలాగా అనే వ్యాపకం నశించడంలేదు.

ఈ విషయాన్ని ఒక గొప్ప రచయితతో చర్చించగా, "వ్రాయాలని ఆవేశము. ఆతురత కలిగినప్పుడు భాష, శైలి, రచనా కౌశల్యం, సహజంగా కలిసివస్తాయి. ఆవేశం మూలసూత్రము" అని చెప్పారు. అలాగే ఆవేశం వచ్చినప్పుడే వ్రాయడం ప్రారంభించాను, వ్రాశాను.

మనం సాధారణంగా చదివే కథలు కల్పితకథలు. నాకథలు నిజమైనవి. కొన్నిటిలో ఏ స్వల్పంగానో కల్పించి వ్రాసినపుడు, పేర్లు మార్చాను. రెండు కథల్లో ఇద్దరు ముగ్గురి నిజమైన కథలను కలిపి ఒకే వ్యక్తి కథగా వ్రాసాను.

నా కథలు నా అనుభవాలే. 1907 సంవత్సరంలో, విద్యార్థిదశలో నన్ను చాలా కలవరపెట్టిన, దుఃఖకరమైన, ఒక గోషాస్త్రీ కష్టాలను, "తెరమరుగున" అనే కథ వ్రాశాను. అలాగే ఉత్తమపురుష ఏకవచనంలో వ్రాసే రచయితకు ఒక క్షోభ అనేది వుండాలి. ఆ వ్యాకులం ప్రజలందరికి సంబంధించినదై యుండాలి. అప్పుడు నిజమైన కథవ్రాయుటకు సాధ్యపడుతుంది. ప్రజా ఉద్యమాలతో, ప్రజల కష్టాలతో సంబంధం ఉండే రచయితలకు ఉత్తమ పురుషలో వ్రాయడం సాధ్యపడుతుంది.

ఆలాగే 1950 వరకు నన్ను కలవర పెట్టుచుండిన సంతోష పెట్టుచుండిన కథలను వ్రాశాను. ఈలాంటివి ప్రజలకు నచ్చితే, ఇంకనూ ఎన్నో వ్రాయగలను. ఈ కథలను చదివినవారు తమ అభిప్రాయాలను నాకు వ్రాయవలసిందని ప్రార్థించుచున్నాను.

ఇదివరకే. కొన్ని కథలు పత్రికలలో ప్రచురించబడినవి. జనవాణి, 'విశాలాంధ్ర' మాసపత్రిక, 'ఆంధ్రవాణి' 'ఆనందవాణి' 'దివ్యజ్ఞానము' మున్నగు పత్రికలలో ప్రచురించబడ్డాయి. ఆయా పత్రికా సంపాదకులకు నా కృతజ్ఞతను తెల్పుచున్నాను.

కడపటిమాట. ఈ సందర్భంలో నా యువక మిత్రుడు, రచయిత, నన్ను ప్రోత్సహించి, నా యింగ్లీషు కథలను తెలిగించి ఈ గ్రంథ రూపంగా పచ్చేందుకు తోడ్పడిన శ్రీ ఎ. బి. కె. ప్రసాద్ గారికి, అడిగిందే తడవుగా ప్రచురించడానికి అంగీకరించిన నవోదయ పబ్లిషర్సు వారికి నా కృతజ్ఞతాభివందనములు.

మద్రాసు
23-11-58

దరిశి చెంచయ్య

# విషబీజం

మీనాక్షి మవుంటురోడ్డులో ఇండస్ట్రియల్ మ్యూజియం బస్ స్టాపువద్ద నిలబడి వున్నది. బస్సులు వచ్చిపోతూ వున్నాయి. ఆవిడ ఎక్కనేలేదు. ఏదో పరధ్యానము. నేను ఎదుటి రేడియో కంపెనీలో అప్పుడే పని ముగించుకొని బయటికి వచ్చాను. నా మేనకోడలిని చూచి చాలకాలమయింది. మాఅక్క చనిపోయిన తరువాత ఇది రెండవ పర్యాయము మీనాక్షి వద్దకు వెళ్ళి, మామూలు కుశల ప్రశ్నలు అడిగాను. "బాగానే వున్నాను" అని వెకిలి నవ్వు నవ్వింది. దుఃఖంలో వున్నదని తెలుసుకొని ఓదార్చుదామని, ఒక టాక్సీలో ఎక్కించి, మెరినాకు తీసుకెళ్ళాను.

ఈ లోపల మాఅక్క, బావ, వారి జీవితాలు, 50 సంవత్సరాలుగ జరుగుచుండిన వారి జీవిత కథ సినీమాలో చూచిన మాదిరిగా, నాకు జ్ఞాపకం వచ్చింది.

నేనంత తెలివితేటలు కలవాడిని కాదు. ఎన్నెన్నో సందర్భాలలో నే ననుకొన్న మాదిరిగా జరుగనేలేదు. కాని మా అక్కగారిని గురించి అనుకొన్నట్టే జరుగుతూ వచ్చింది.

మా అక్క, మా పెదనాయనకూతురు; సీతారత్నం. ఆయన చాల బీదవాడు. అంగళ్ళలో నౌకరీ చేశాడు; గుమస్తా అయ్యాడు. చిన్న అంగడితో ప్రారంభించి, తన తెలివితేటల

వల్ల, పట్టుదలతో పనిచేయుట వల్ల, పిసినారిగా జీవించడం వల్లను లక్షరూపాయల అస్తి గడించాడు. ఒక్కతే కూతురు సీతారత్నం.

ఇంత ద్రవ్యం గడించినా, తన చిన్ననాటి అలవాట్లు పోలేదు. తాను తినడు, ఇతరులకు పెట్టడు. ఆ రెండు రంగు పంచలు, తువాళ్ళే; స్నేహితులకుగాని బంధువులకుగాని భోజన మైనా పెట్టడు. ప్రాణమైనా విడుస్తాడుగాని, డబ్బు ఖర్చు కాకూడదు. ఇన్ని లోపాలుండినా, కూతురు మీద ఎంతో ప్రేమ. ఎంత కట్నమైనా ఇచ్చి చాలా గొప్ప కుటుంబంలో పెండ్లి చేయించాలని కోరిక. చదువు, నాల్గవక్లాసువరకైనా చెప్పించలేదు. సంగీతం అసలేలేదు. కూతురికి తండ్రిమీద భక్తి; ఆస్తిమీద, ఆయనకులాగే, అత్యాశ. ఇతర కోరికలు అంతగా బాధించేవి ఏమీ ఉండలేదు.

మా బావ సుబ్బారావు అలాంటివాడు కాదు. గొప్ప కుటుంబం. తండ్రి సబ్ జడ్జిగా పనిచేశాడు. ప్రజాసేవ చాలా ఇష్టము. అందువల్ల ఆయన పేరు ప్రఖ్యాతి సంపాదించాడు; స్నేహితులు బంధువులు అధికం. ఇంటిలో తినేవారు లెఖ్ఖ లేరు. అదొక సత్రము. ఆయనదొక ధారాళమైన మనసు. చివరకు దివాన్ బహదూర్ బిరుదుకూడ సంపాదించారు. మా బావకు తండ్రిగారి గుణాలు వచ్చినయి.

మిగిలినవారు యిస్తానన్నదానికంటే చాల ఎక్కువగా కట్నము యిచ్చాడు, మా పెదనాయన. ఆయన ఆస్తి చివరకు కూతురిదే. అందువల్ల సబ్ జడ్జిగారు, బాగా ఆలోచించి, ఈ పిసినారి కూమార్తెను కోడలుగా చేసుకున్నాడు.

మా బావకు మద్రాసులో ఉద్యోగం లభించింది. నేను వారి యింటికి తరుచుగా వెళ్లుతూ వచ్చాను. మా బావ అజానుబాహుడు; అందగాడు. క్లబ్బులలో, సంగీత సభలలో, నాటక సభలలో, క్రికెటు క్లబ్బులలో మెంబరు; అయినా, ఒక ఆటగాని, పాటగాని, ఒక వేషంగాని ఆయన చేతకాదు. అన్నిటిలో అధికార స్థానం సంపాదించాడు. గొప్పగుణం ఏమంటే ప్రతిఫలం కోరకుండా సేవచేసేవారిలో మా బావతో సమానులు లేరు. ఎక్కడ చూచినా స్నేహితులే; ఎప్పుడూ విందులకు, వివాహాలకు ఆహ్వానాలే: తీరిక వుండదు. తన యింటికి వచ్చిన స్నేహితులకే కాదు. కొత్తవారికి సహా, టీ యిస్తాడు; భోజన సమయంలోవస్తే, భోజనం చేసేవరకూ వదలడు. కులం, జాతి, మతము అనే వివక్షత కూడా లేదు.

మా అక్కకు ఈలాంటివి ఎంతమాత్రమూ గిట్టవు. "వీటివల్ల ఏమి ప్రయోజనం? ఏలాంటి బుద్ధిహీనుడైనా ఖర్చు పెట్టగలడు: కష్టాల్లో ఈ స్నేహితులు చిల్లిగవ్వఅయినా యివ్వరు. మనల్ని ఆదుకొనేది ఆస్తి, ఆస్తిలేనిది గౌరవం వుండదు" అని గొణుక్కుంటూ వుండేది. వివాహాలలో ఆమె చూస్తూనే వున్నది. ఎక్కువ నగలు వేసుకున్న స్త్రీలకే ఎక్కువ మర్యాద. పెద్ద బంగళాలలోవుండి పెద్ద పెద్ద కార్లలో తిరిగేవాళ్ళకే ఎక్కువ మర్యాద. తన భర్త ఈ సత్యం గ్రహించడు; తన సంపాదనలో ఏమీ మిగలడంలేదు. తండ్రి ఆస్తిలోనుండి కూడా ఖర్చు చేస్తున్నాడు.

ఎంతో చెప్పి చూచింది. ఆయన ఈ విషయాలను లక్ష్యపెట్టడు. నవ్వుతాడు, నవ్వించి తప్పించుకోవాలని ప్రయ

తిన్నిస్తాడు. ఒక్కొక్కప్పుడు భర్తతో తగవులు పెట్టుకోడానికి కూడా ప్రయత్నించింది. ఆయన తగవులాడడు! చాలా చాలా బాధలు పడుతూ వచ్చింది.

నేను వారింటికి వెళ్ళానా, నేను తనతో కూర్చుండి భోజనం చేసేవరకు మాబావ వదలిపెట్టడు. మాఅక్క తిట్టి పోసుకుంటూ వుంటుందని నాకు తెలుసు. ఆమెకు నామీద ప్రేమలేకకాదు. భోజనం పెట్టితే నాలుగణాలు ఖర్చు అయి పోయిందనే విచారం. మా బావకు జీవితమంటే జీవించడమనే అర్థం: మాఅక్కకుజీవించడం అంటే ఎక్కువ ఆస్థికూడబెట్టడం అనిఅర్థం: అయితే మాబావ సమర్థుడు. ఆమెన్నుతిట్టడు, కొట్టడు; హేళన చేస్తాడు. ఆయన కాబట్టి మా అక్కతో జీవించగలి గాడు. మరొకరైతే సన్యాసం పుచ్చుకోవాలి; లేదా ఆత్మ హత్య చేసుకోవాలి.

* * *

పదిహేను సంవత్సరాలయింది. వారికి బిడ్డలు కలుగ లేదు. బిడ్డలు పుట్టకపోవడమే మంచిదని నే ననుకొనేవాడిని. బిడ్డలు సుఖపడరని నా ఆలోచన. బిడ్డలు పుట్టడంతో పెంచ డంతో, ఆమె హృదయంలో పరివర్తనం ఏర్పడుతుందనీ, భార్యాభర్తలుఎక్కువ సుఖపడతారని, నాస్నేహితుడు నాతో వాదించేవాడు. కాని,నాఆలోచనలో మార్పు రావడమేలేదు.

16 సంవత్సరాలకు మా అక్కకు, ఒక ఆడపిల్ల కలి గింది. దానితో ఆమె ఉబ్బసముకూడా నయమయింది. సంతో షంగావుంది. కూతురిని ప్రేమించింది. ఇదే మంచి సమయం, అనుభవిస్తామనే ఆలోచనతో మాబావ కాశీ, రామేశ్వరం

సేవించిరావాలనే నెపంతో కాశ్మీరు, వూటి, ఆగ్రా, ఢిల్లీ వగైరా ప్రదేశాలకు భార్యాబిడ్డలతో కలసి వెళ్ళాడు. ఆ ఒక్క సంవత్సరం మాత్రమే ఆయన సంసారజీవితం సుఖంగా గడిచింది.

*　　　*　　　*

అటు తరువాత, మామూలు, తప్పలేదు. కూతురు చదువు విషయంలో, యూరోపియన్ కాన్వెంటుకు పంపాడు తండ్రి; కూడదని మాన్పించివేసింది తల్లి. సంగీతం చెప్పించాలని వీణకొన్నాడు. టీచరును ఏర్పరిచాడు. ఏమి ప్రయోజనము? తల్లి అభిప్రాయం ప్రకారం తాను నడచుకోకపోతే కొట్లు, తిట్లు తప్పవని తల్లి చెప్పినట్టే చేస్తూండేది, మీనాక్షి. తండ్రి చెప్పినట్టు చెయ్యకపోయినా, ఆయన గ్రహించగలడనీ, క్షమించుతాడనీ, ఆయన విశాల హృదయాన్ని గ్రహించింది. తన జీవితాన్ని తల్లిగారి శిక్షణ ప్రకారం గడిపింది. అందువల్ల స్వశక్తి ఎంతమాత్రమూ అభివృద్ధికి రాలేదు. గొర్రె పిల్లలాగు తల్లిని అనుసరించింది.

*　　　*　　　*

వివాహం చెయ్యాలి. ఎందరెందరో వచ్చారు. మా అక్కకు నచ్చడంలేదు. బావ ఏమి చేయగలడు? ఆమె ఎన్నివిధాల నిందించినా, దెప్పిపొడిచినా, ఓర్చుకోవడం నేర్చుకొన్నాడు. చివరకు సంబంధాలు కోరేవారు ఆపిల్ల కొరకు రావడమే మానేశారు.

ఒకరోజు వారింటికి వెళ్ళాను. బావా, నేనూ తాంబూలం వేసుకుంటూవున్నాము. మా అక్కగారు వివాహం విషయం

ప్రస్తావించారు. "మీ బావగారు ఉత్సాహపెట్టడమే లేదు; నీవైనా సహాయం చెయ్యవా?" అని కండ్ల నీళ్లు పెట్టుకొన్నది. ఎందరో మంచి కుర్రవాళ్ళు ఉన్నారని చెప్పాను. తనకెవరూ ఈ ప్రపంచంలో కంటబడలేదన్నది అక్క. ఆకాశంలో లేరు, భూలోకంలో ఎందరో వున్నారని హేళనచేశాను. మా బావ గారు మందహాసం చేశారు.

"అక్కయ్యా, వరునికి ఎంతవయసుండాలి" అన్నాను.

"16-18 ఏండ్ల మధ్యనవుండాలి"

"ఏం ప్యాసు అయి వుండాలి?"

"బి.ఎ. అయివుండా."

"రంగు ఎలాగుండాలి?"

"నల్లగా వుండకూడదు; కొంచెం ఎత్తుగా వుండాలి"

"ఇక ఆస్తివిషయ మేమంటావు?"

"ఒక లక్ష అయినా వుండకపోతే ఎలా అబ్బాయి?"

"అన్నదమ్ములు అక్కచెల్లెండ్లు ఉన్న ఇల్లు మాత్రం అయితే, వద్దు బాబూ!

"ఒక్కడే కొడుకు ఉండే యింటిలో ఇస్తే, మన అమ్మాయి సుఖపడుతుంది."

"అల్లుడు మీయింటిలో ఉండాలికదా!" అని అడిగితిని

"లేకపోతే, మాఆస్తి అంతా ఏమి చేసుకోను."

"ఈలాంటివాడు లభించడం దుర్లభం: లభించుతాడనుకో, కూతురిని ముద్దెట్టుకోవాలంటే కూడా నీ వుత్తరువు కావాలికదా?" అని అన్నాను.

మా బావ కడుపు ఉబ్బేలాగు నవ్వాడు. ఆమెకు సిగ్గేసి తలుపుచాటుకు వెళ్ళింది. "ఒరే! నారాయణా! మీ అక్కను ఎంత బాగా అర్థం చేసుకొన్నావురా?" అన్నాడు.

"అక్కయ్యా! అలాంటి అల్లుడు ధనవంతుల ఇంట్లో లభించడు. వృథా ప్రయాస. బీదవానిని, మంచివానిని వర్చ రచి, ఇంటిలో వుంచుకో" అని సలహా చెప్పాను.

"చూస్తూ, చూస్తూ బీదవాని చేతిలో ఏలాగు పెట్టను?" అన్నది.

"నారాయణా ! నా తల్లో చూడు! ఇంకా ఎన్ని వెంట్రుకలు మిగిలి ఉన్నాయో ? మీ అక్క పుణ్యాన అవి కూడా రాలిపోతాయి!" అన్నాడు మా బావ. దుఃఖంతో విసుగుతో.

* * *

కొంతకాలం జరిగింది. ఒకరోజున ఒక కుర్రవాడు తన మెడల్సు అమ్ముకోడానికి నా నగల దుకాణానికి వచ్చాడు. చిన్నవాడు; అందమైనవాడు; ముఖంలో మంచి కళ; దుఃఖంలో ఉన్నట్లు కనిపించాడు. నాకు జాలివేసింది. "ఎందుకు నాయనా! అమ్ముతావు ?" "అన్నాను తన సర్టిఫికేట్లు వగైరా చూపించాడు. స్కూలుఫయినల్లో ఫస్టుక్లాసు; ఎన్నో బహుమతులు; ఇంటరులో ఎన్నో మెడల్సు సంపాదించాడు. బీదవాడు; ఇంటరు పరీక్షకు ఫీజు కట్టాలి డబ్బులేదు; అందువల్ల మెడల్సు అమ్మవలసి వచ్చింది. బావ జ్ఞాపకం వచ్చాడు. ఒక లెటరు వ్రాసి ఆ పిల్లవానికి యిచ్చాను. అబ్బాయి, ఈ ఉత్తరం తీసుకెళ్ళు. నీకు కావలసిన సహాయం లభించుతుందని చెప్పాను.

మామాబావ చదువుకున్నాడు. "ఈ అబ్బాయిని అల్లు డుగా చేసుకో!" అని మాత్రమే వుంది. ఆయనకు ఆశ్చర్యం వేసింది; సంతోషంకూడా! అన్ని విధాల బాగుంటుంది. భార్యతో చెప్పాడు. పిల్లవానిని నాలుగురోజులు ఇంటిలో వుంచుకొని పంపాడు. "నీకు ఏలాంటి సహాయం కావలసినా నాకు వుత్తరం వ్రాయి" అని అభయమిచ్చాడు.

వాని తల్లిదండ్రులను పిలిపించి పెండ్లి ఏర్పాటు చేశాడు. పెండ్లిరోజే ఇంటరులో ఫస్టుక్లాసు ఫ్యాసు అయ్యా డని న్యూసు పేపర్లలో వచ్చింది.

కుటుంబంలో ఆటలు, పాటలతో చాలా సంబరంగా వుండింది. అందరికీ ఆశాజనకంగా వుండింది. అల్లుణ్ని ఇంగ్లాండు ఐ. సి. యస్.కు పంపాలని మామగారు. "అక్కడ ఏ దొరసాని వాతనోపడతాడు, పంపకూడదు" అన్నది అత్త గారు.

"కూతురునికూడా పంపుతాను" అన్నాడు.

"అదృష్టం వుంటే మనదేశం చదువులు చాలవా?" అన్నది. అల్లుడు నిర్ఘాంతపడి పోయ్యాడు.

ఆస్తిపాస్తులను గురించి, సమయా సమయంలేకుండా అత్తగారు ఇచ్చే ఉపన్యాసాలతో విసుగెత్తింది. బీదవాడై నందున, అత్తగారు మర్యాద చూపడంలేదని గ్రహించాడు. నిరాశ దుఃఖము ఏర్పడ్డాయి. శంకరరావుకు చురుకుదనం పోయింది. పరీక్షలలో సరిగా మార్కులు రావడంలేదు. "తిన మరిగాడు చదువు మానేశాడు" అని ఆమె కుమార్తెతో

అనడం విన్నాడు. పారిపోవాలనుకొన్నాడు. అయితే మామ గారి ప్రేమపాశాలను ఛేదించుకోలేకపొయ్యాడు. ఆయన మీద తండ్రికంటె, గురువుకంటె, దేవునికంటె ఎక్కువ భక్తి కలిగింది. ఆయనకు దుఃఖం రాకూడదనుకొన్నాడు.

ఏలాగో బి. ఎ. ప్యాసయ్యాడు. బి. యల్. తప్పి పోతూ వుండినాడు. చివరకు హైకోర్టులో రు 75-0-0 తో ఉద్యోగం ప్రారంభించాడు. వేరుగా కాపురముందామని భార్యను బతిమిలాడాడు. ఆవిడ కళ్ళనీళ్ళు పెట్టుకొన్నది. మామ చచ్చిపొయ్యాడు ఇకనైనా వేరుగా వుందామని సలహాయిచ్చాడు. తండ్రి, తన లక్షరూపాయల ఆస్తిని భార్య పేర వ్రాసిపెట్టాడు. భర్తతో వెళ్ళితే తల్లి ఆస్తిని యివ్వదని భయం. తల్లిని విడిచిరానన్నది. ఏలాగో కొంతకాలం ఓర్చు కోమని చెప్పింది. మామ జ్ఞాపకం వచ్చాడు. భార్యను విడిచి పోకూడదని తీర్మానించుకొన్నాడు

*　　　*　　　*

యుద్ధం చాలా తీవ్రంగా నడుస్తున్నది. ఇంగ్లీషుదొరలు పారిపోతూవున్నారు. జపానువారు మద్రాసులో దిగుతారనే భయంతో ప్రజలు మద్రాసు విడిచిపెట్టి వెళ్తున్నారు అత్త గారు కోయంబత్తూరికి ప్రయాణం కట్టింది. అల్లుడు వుద్యోగం విడిచి రాలేనన్నాడు కూతురుని తనవెంట తీసుకెళ్ళింది. అల్లుడు భార్యని తనతో వుండేలాగు ఒప్పించలేకపొయ్యాడు.

ఆ రోజుల్లో అన్ని విషయాల్లోను కష్టమే. అన్నం లభించదు; నౌకర్లు వెళ్ళిపొయ్యారు. ఇండ్ల తలుపులువేసి దూరప్రదేశాలకు వెళ్లారు. పట్టపగలే దొంగతనాలు.

బర్మానుండి ముందుగానే వచ్చిఉన్న ఒకరి యింటిలో, ఒక గది అద్దెకు తీసుకున్నాడు. ఆయింట్లో తల్లి, తండ్రి, ఒక కుమార్తె మాత్రమే. కొడుకు ప్రయాణంలో చచ్చి పొయ్యాడట. ఈ శెట్టియార్లు మర్యాద గల కుటుంబం. తాము టీ, పలహారము పుచ్చుకొన్నప్పుడు శంకరరావుకు కూడా యిస్తూ వుండేవారు. శంకరరావు ఎన్నో విధాల ఆ కుటుంబానికి సహాయం చేస్తుండేవాడు. ఆ యింటివారు ఈ యనను చూచి, చనిపోయిన కుమారుణ్ణి జ్ఞాపకం తెచ్చుకొనే వారు.

మరి కొన్నాళ్ళకు హోటల్సుకూడా మూసివేశారు. కాబట్టి శంకరరావుకు తమ యింటిలోనే భోజనంకూడా పెట్టారు. ఆ కూతురు, ఎంత సేవచేస్తూవుండినా, తన మర్యా దకు లోపం రాకుండా జాగ్రత్త పడుతుండేది. ఆమె చెయ్యి చాల ధారాళం. ఆయన గదిని శుభ్రపరచి, పూలు పెట్టేది. అన్ని గదులలోవలెనే అత్తరువత్తిని వెలిగించేది తాను ఆవి డను ఒక చెల్లెలిలాగున ఆదరించాడు.

అంతలో తండ్రి హృదయం ఆగిపోయి హఠాత్తుగా చనిపోయాడు. స్వంత కుమారుడిలా సేవచేశాడు. వారూ అలాగే ప్రేమించారు.

*                *                *

శంకరరావుకు టైఫాయిడ్ వచ్చింది. అత్తకు భార్యకు వ్రాసుకున్నాడు. మద్రాసులో నర్సింగుహోములో చేరవల సిందని, గొప్ప డాక్టరువద్ద మందు పుచ్చుకోమని వ్రాసింది

అత్త! డబ్బు ఏ మాత్రమూ పంపలేదు. చావు బ్రతుకుల్లో ఉన్నాడు. భర్త ఏమవుతాడో అని విచారం కలిగింది మీనాక్షికి. కాని, తల్లిని విడిచి రాలేకపోయింది. ఆ ఇంటివారు సేవచేసి, అతనిని జీవించేలాగు చేశారు. ఎంతో వ్యయంచేశారు. తాను మరల జీవించేలాగు చేసిన రాధకు తన జీవితం అర్పించాడు. భార్యాభర్త లయ్యారు.

కొద్దికాలంలోనే మా అక్కకూడ చనిపోయింది. ఇక భర్తతో సుఖంగా కాపురం చెయ్యవచ్చునని ఆశించింది మీనాక్షి. శంకరరావు ఉన్నమాట ఉన్నట్టుగా వ్రాశాడు. తన కిష్టంవుంటే తన నూతన కుటుంబంతో ఉండమని వ్రాశాడు. రెండవ భార్యను వదలివేసి రమ్మన్నది మీనాక్షి. రాధను వదలిపెట్టనన్నాడు. ఇద్దరు బిడ్డలు కలిగారు. మూడు సంవత్సరాలు గడిచినవి.

*    *    *

మా టాక్సీ మెరినా చేరింది. బీచిలో మీనాక్షి నేనూ కూర్చున్నాము. శంకరరావును కలుసుకున్నావా అని అడిగాను.

"నిన్ననే ఆయన యింటికి వెళ్ళాను. రాధ నన్ను బాగా మర్యాదచేసింది. టీ యిచ్చింది. తాంబూలం యిచ్చింది. పెద్దమ్మకు ముద్దివ్వండి అంటూ నా ఒళ్ళో కూర్చోబెట్టింది పిల్లల్ని. చాల ముచ్చటగా వున్నారు. ముద్దెట్టుకొని లేచాను. ఆయన ఆఫీసునుండి వచ్చేసమయమయింది, పోవద్దు అని ఎంతో వేడుకొన్నది రాధ. మరొకదినం వస్తానని తప్పించుకొని వచ్చాను" అన్నది, మీనాక్షి.

"తిరిగి ఎప్పుడు వెళ్ళుతావు ?" అని అడిగాను.

"ఎక్కడికి మామయ్యా ?" అని వింతనవ్వు నవ్వింది. "వారయినా సుఖపడనీ" అన్నది. దూరంలో మెల్ల మెల్లన మరుగై పోతున్న స్టీమరును చూస్తూ.

# అ ద్రె సు

రాత్రి 9 గంటల సమయంలో ఎవరో చీకట్లో ఇంటికి వస్తున్నారు. నడుము వంగినట్టుగా వుంది. కాని బిచ్చగాడు కాదు. "ఈ సమయంలో రాకపోతే, పగట్లో మరునాడు రాకూడదా!" అని అనుకొన్నారు ప్రభాకరరావుగారు.

షష్టి పూర్తయిన ప్రభాకరరావుగారికి ఒక టయిం టేబిలు ప్రకారం జీవితం గడిపే అలవాటు. మంచివిగాని, చెడ్డవిగాని, ఈ వయసులో అలవాట్లు మార్చుకోటం కష్టం— రాత్రి తొమ్మిది గంటలకు రేడియో న్యూసువినే అలవాటు; 9-30 కు పడుకొని నవలలు చదువుకోవాలి; పదిగంటలకు నిశ్చింతగా నిద్రపోవాలి.

"ఎవరండి తమరు?" అన్నారు ప్రభాకరరావుగారు.

"నాపేరు సుబ్రహ్మణ్యమండి. మిమ్ములను చూచి ముప్పై సంవత్సరాలయింది."

"ఓ! తమరా? రుక్మిణి భర్తగారనుకుంటాను! ఎంత మారిపొయ్యారు? గుర్తుపట్టడమే కష్టంగావుంది!..."

"అవునండి...ఇప్పుడు ఆమె ఎక్కడ వున్నదండీ?— అడ్రెసు తెలుసుకుందామని వచ్చాను."

"ఎందుకండీ మీకు ఆమె అడ్రెసు?...మీరు ఆమెను విడిచేసి 18 సం॥రాలు అయిందా?"

"అయిందండీ!"

"పద్దెనిమిది సంవత్సరాలుగ మీ భోగట్టా ఏమీ తెలియదు! ఏమిచేస్తూ వుంటిరి?"

"రుక్మిణిని వదలివేసిన మూడు సంవత్సరాలకు చిత్తూరిలో పానుగంటి సుబ్బయ్యగారి కుమార్తెను వివాహం చేసికొంటిని. ఇద్దరుబిడ్డలు పుట్టి పురిటిలోనే పోయారు. పదియేండ్లు కాపురంచేసిన తరువాత ఆమె కాలంచేసింది. ఆమె జీవించి యున్నంతకాలమూ, నాకు అన్నివిధాల బాగానే జరిగిపోయింది. ఉద్యోగంలో నెలకు 75 రూపాయలు వచ్చేది. కాని దురదృష్టవశాత్తు ఉద్యోగంకూడా పోయింది."

"సర్కారు ఉద్యోగం! ఎందుకు పోవాలి? ఏదో తప్పు పని చేసివుంటారు!"

"రేషన్ ఆఫీసులో అందరం లంచాలు తీసుకొనే వాళ్ళం. అందరిలోకి నేనే కొంచెం భయపడేవాడిని. చివరకు నాకేపోయింది ఉద్యోగం. అసలు వాళ్ళు బాగానేఉన్నారు. అటు తరువాత ప్రయివేటు ట్యూషన్లు చెప్పుకుంటూ వుంటిని."

మిమ్మల్ననూ, మీ బట్టలనూ చూస్తే, ఆర్థికంగా చాలా కష్టాల్లో ఉన్నట్టుంది.”

“అవునండీ... రుక్మిణి యిప్పుడు ఏమి చేస్తున్నదండీ?”

“ఆమె ఏమి చేస్తున్నదా!... ఇన్ని సంవత్సరాల తర్వాత... ఆమె భోగట్టా కావలసివచ్చిందా? నీకు 18 ఏళ్ళ కొమారుడున్నాడు తెలియదా?”

“అప్పుడు గర్భిణి. కొడుకు పుట్టాడని వింటిని. అటు తరువాత, ఆమెను మీరు సేవాసదనములో చదివించుచుంటి రని, టీచరు కాబోతుందని ఎవరో చెప్పిరి.”

“ఐతే, ఆమె యోగక్షేమాలు నీ కింతకలంటె తెలియ దన్నమాట.”

“మీరు దయచేసి ఆ విషయాలను చెప్తారని మీ దర్శ నార్థం వచ్చాను. మద్రాసులో మీయిల్లు తెలుసుకోవడంలో చాలా కాలయాపన అయింది. అందులోనూ రాత్రిసమయం.”

“ఆమె అడ్రెసు నీ కెందుకు? తిరిగి ఆమెతో కలసి వుండాలని వచ్చావా?”

“అవునండీ... కలిసి వుండాలనే వచ్చాను.”

“ఆమెతో రెండు సంవత్సరాలు కాపురం చేసితివి. అంతట తరిమివేస్తివి. వివాహానికిముందు, అమె వ్యభిచ రించిందనేనా?”

“అవునండీ. వూరంతా గోలపెట్టారు. మా తాలూకా ఆఫీసులో గుమాస్తాల అల్లరి పడలేకపోయాను!”

"నీ భార్యను తెలిసిన పెద్దలు, ఆమె మంచిదని చెప్పినా, నీవు నిరాకరించావు కాదా?"

"అవునండి. ఆ వూరిలో నేను ఎక్కడకు వెళ్ళుతూ వుండినా, వేలుపెట్టి చూపించేవారు, హేళనచేసేవారు. విసుగెత్తిందండీ"

"అప్పుడేమో ఆ పిల్లను యిచ్చి వివాహం చేయించే వరకూ నా వెంట పడితివి. చదువుకున్న వాడివి; మర్యాదగల వాడ వనుకొంటిని. అంత పిరికిపందవని అనుకోలేదు."

"అవునండి. నేను భయపడిపోయానండి."

"పాపం! ఎంత ఆశపడివచ్చావు! ఉద్యోగం చేసుకొని సంపాదించుచున్నదని, నీ కష్టాల్లో నిన్ను దగ్గరతీసి ఆదరించుతుందని ఆశపడి వచ్చావు."

"అవునండి ఆమె అడ్రెసు యిస్తే కృతజ్ఞుడను."

"నీవు ఆ అమాయికురాలికి చాలా అన్యాయం చేశావు. 16 సం॥ల వయసు. గర్భిణి. మర్యాదగల కుటుంబం. నీవల్ల వితంతూద్వాహ ఉద్యమంలో మేము పడ్డ కష్టాలను జ్ఞాపకం తెచ్చావు. నీవు దుర్మార్గుడివి. నీకు సహాయం చెయ్యకూడదు. నీకు అన్నానికి ఉన్నంతవరకు ఆమె అవసరం లేకపోయింది. పో! లేచిపో! నా యింటిలో నీవు కాలు పెట్ట తగవు."

"ఆమె అడ్రెసు...?"

"నేను యివ్వను."

"ఈ చీకటిలో ఈ కొత్తవూరిలో ఎక్కడికి పోగలను? ఉదయాన్నే వెళ్తాను."

"లేచి పోతావా? లేక తన్ని పంపమంటావా? ఊఁ! లే! పో!"

ఇక లాభంలేదనుకొని, చీకటిలోనుంచి వచ్చినవాడు చీకటిలో కలిసిపోయాడు.

"ఏమండీ! ఈ కేకలు! ఇరుగూ పొరుగూ అందరూ నిద్రలేచారు. ఒక చాప దిండు యిస్తే పండుకోడా! ఈ చీకటిలో అ ముసలాయన్ను తరిమి వెయ్యడం న్యాయమా?" అన్నది ప్రభాకరరావుగారి భార్య యీ గోల వినివచ్చి.

"అవును! తరిమివెయ్యడమేన్యాయం పాపిష్ఠిముండని."

"ఆయన అడిగిందంతా అడ్రెసేగా? యిచ్చివుండకూడదా?"

"ఎవరి అడ్రెసు, నాన్నా?" అని అడిగింది కూతురు నిద్రకళ్ళు నులుముకుంటూ.

"ఆయన భార్య అడ్రెసట!"

"ఆయన భార్య అడ్రెసు, అయనకు తెలియదా? మా నాన్నకు మతిపోయింది, అమ్మా!"

"ఆయనభార్య అడ్రెసు ఆయనకు చెప్పడంలో తప్పేమిటండీ!" అని అడిగింది భార్య.

"నాకుమాత్రం ఏలాగు తెలుసు? ఆమె చచ్చిపోయి 16 సం॥లు ఐంది."

# మాతృత్వమా ? పాతివ్రత్యమా ?

శంకరరావు ఉదయాన్నే స్నానంచేసి చలువబట్టలు వేసుకొన్నాడు అత్తగారు ఆనందంతో పెట్టిన ఫలహారం స్వీకరించి కిళ్ళీ నవులుతూ సోఫాకుర్చీలో కూర్చొన్నాడు.

ఒక ముసలమ్మ మనుమరాలిని వెంటపెట్టుకొని వచ్చింది "శంకర్రావుగారూ నమస్కారమండీ, మా చిన్న పిల్లకు పునర్వివాహం చేయించి పుణ్యం కట్టుకొన్నారు. భార్యాభర్తలు సుఖంగా వున్నారు. మీరుణం తీర్చుకోలే మండీ" అన్నది ఆ వృద్ధురాలు.

రుక్మిణి చాల మంచిపిల్ల. తప్పకుండ సుఖపడుతుంది అన్నాడు శంకరరావు.

ఈపిల్ల రుక్మిణి అక్క పార్వతి. చెల్లెలులాగే తాను కూడ పునర్వివాహం చేసుకొని సుఖపడాలని కోరుతూంది. మీ వద్దకు తీసుకెళ్ళమని పట్టు పట్టిందండి. దీన్ని ఒక యింటి దానిని చెయ్యండి అంటూ చెప్పసాగింది అవ్వ. శంకరరావు చాల సంతసించాడు.

ఆ సమయంలో అత్తగారు మెల్లగా మెట్లమీదికి ఎక్కి క్రిందికిరమ్మని శంకరుడికి సైగ చేసింది. ఏదో బలమైన

కారణముండాలని వాళ్ళిద్దరినీ కూర్చోమనిచెప్పి శంకరరావు క్రిందికి వెళ్ళిపోయాడు

ఈ పార్వతికి చాలా చెడ్డపేరు వుంది. దీన్ని తెలియని వారు యీ వూరిలో లేరు. దీనికి పునర్వివాహంచేయిస్తే మీ వితంతువివాహ ఉద్యమానికి గొప్ప అపకీర్తి వస్తుంది అని అత్తగారు చెప్పారు.

రుక్మిణికి వివాహం చేయించాముకదా! మీ కేలాటి చెడ్డపేరు రాలేదే అని శంకరరావు అన్నాడు.

"అది మంచిపిల్ల. దానికి ఏలాంటి చెడ్డపేరు లేదు," అన్నది అత్తగారు.

పార్వతి విషయంలో ఏమిచెయ్యాలో, తీర్మానించుకోలేక పోయాడు శంకర్రావు. దీర్ఘంగా ఆలోచిస్తూ మెట్లు ఎక్కాడు.

"పార్వతీ! నీకు వివాహం చేయించమంటున్నావే! నిన్ను వివాహం చేసుకోటానికి మీకు తెలిసినవాళ్ళల్లో ఎవరైనా ఉన్నారా?"

"లేరండీ. మీరే సహాయంచెయ్యాలి."

"పార్వతీ! నా ప్రశ్నలకు ఉన్నది ఉన్నట్టు జవాబు చెప్తావా?"

"తప్పక చెప్తాన"న్నది ఆ అనాధ.

"అమ్మాయి! నీ కీవూరిలో చాల చెడ్డపేరు వుందటగా?"

ఆమె తలవంచింది. కండ్లనీళ్ళు రాలుతున్నాయి

"పార్వతీ! నీకు వివాహంచేయిస్తే ఉద్యమానికి అప కీర్తివచ్చి అసలు ఉద్యమమే పాడైపోతుందేమో!"

పార్వతి జవాబు చెప్పలేదు.

"నీకు ఏలాగో జీవితం గడిచిపోతూ వుందికదా?"

పొంగిపొరలే దుఃఖాన్ని ఆపుకుంటూ పార్వతి జవాబిచ్చింది.

"నేను అప్పుడు చాలా పసిదాన్ని. పదమూడేండ్ల వయసు. పొరుగుంటి యువకుడు... తెలియక తప్పుజేశాను... నాకు మరే సౌఖ్యంకొరకు కాదు పెండ్లి కావాలనడం."

"అయితే పెండ్లి చేసుకోవడం ఎందుకమ్మా?"

బిడ్డను కని పెంచుకోవాలనే కోరికండీ: స్త్రీలకు అమ్మా అంటూ ఆటలాడుకొనే పిల్లలకంటె కోరతగిన దేమీలేదు. భర్త లేకుండాకని సంఘంలో జీవించగలనా? అందువల్లనే వివాహం చేసుకొనవలెనని కోరిక. సెక్సుమీద కోరిక లేదండి.

శంకరునికి ఆశ్చర్యం వేసింది. కండ్లలో నీరు కమ్మినాయి. పార్వతికి వివాహం చెయ్యడం న్యాయం, మానవ ధర్మం. చేయిస్తామూఅంటే ఉద్యమమునుమీద దుమ్మెత్తి పోస్తారు, మూర్ఖులు. ఏమిచెయ్యాలో్న అతనికి తోచడంలేదు.

"పార్వతీ! నీకు సరియైన భర్త లభించడం కష్టమమ్మా! అయినా నాశక్తి కొలదీ ప్రయత్నిస్తాను. కానీ నువ్వు నీ భర్తతో న్యాయంగా ప్రవర్తిస్తావా?"

"తప్పక అలాగేనండీ!"

"బాగా ఆలోచించుకొని రేపుఉదయం ఇదేసమయానికి కలుసుకో, అప్పుడు స్థిరంగా తీర్మానించుకొందాం" అని పార్వతిని, ముసలమ్మను పంపివేశాడు. శంకరునివైఖరి అత్తగారికి నచ్చలేదు. సరియైన సంఘపరిస్థితులలో పార్వతి పతివ్రతగా ఉండగలదనే నమ్మకం శంకరుడికి కలిగింది. తప్పుచేసిన వారిని క్షమించి, మరోఅవకాశం యివ్వడం ధర్మమని ఆయన అభిప్రాయం.

పార్వతి ముఖంలో ఆశ, సంతోషం కనుబడ్డాయి. "నీకు మరో అవకాశం యిస్తే నీభర్తకు విశ్వాసపాత్రంగా ప్రవర్తిస్తావా" అనిఅడిగాడు శంకరరావు. "తప్పక అలాగేనండీ, ప్రమాణం. చేసి చెపుతున్నాను. మీకు అగౌరవం తీసుకురానండి." అంటూ నమస్కరించింది పార్వతి.

కానీ పార్వతికి సరియైన భర్త లభించగలడా? ఆవిడ తప్పులనుక్షమించి వివాహం చేసుకొనే విశాలహృదయుడు లభించగలడా? అని ఆలోచించసాగాడు.

తన వ్యాపారంనిమిత్తం అప్పుడప్పుడు ప్రయాణంసాగించేవారు శంకరరావు. కానీ కొన్నిపట్టణాలలో సంఘం ఆయన్ని బహిష్కరించింది. ఆకాలంలో ఆయన్ను క్రొత్తవారెవరైనా భోజనానికి పిలిస్తే వారికి తన ఉద్యమముమీద ఉండిన అభిమానమే కారణమని తలంచేవారు.

ఒకరోజు ఒకతాలూకా ఆఫీసు గుమాస్తా శంకరరావును భోజనానికి పిలిచాడు. అంతకుముందు అతనితో పరిచయం వుండలేదు. అతనికి 30 సంవత్సరాలుంటాయి. ఆయన అక్కగారు వితంతువు. ఆయనకింకా వివాహం కాలేదు. గోపాల

స్వామికి తమ ఉద్యమంమీద అభిమానం కలదని భోజన సమ
యంలో మాటల సందర్భంలో తెలుసుకొన్నాడు.

"ఏమండీ! ఇంతవరకూ వివాహం చేసుకోలేదు ?" గోపాలస్వామి జవాబేమీ చెప్పకుండా నవ్వాడు. పెండ్లి అన గానే నాకు ఏవేవో ఆలోచనలు వస్తుంటాయి" అని అన్నాడు గోపాలస్వామి.

శంకరరావు పార్వతి అడ్రసు యిచ్చినాడు. ఆవిడ మీకు నచ్చుతుందేమో చూచి మాటలాడి నాకు వ్రాయండి.

గోపాలస్వామి అలాగే చేశాడు. పార్వతిని వివాహం జేసుకోడానికి సమ్మతించాడు. ఆయన శాంతంగా విచారించి వుండరని, పెండ్లి అయినతర్వాత కష్టపరంపరలు కలుగునని శంకరరావు తలచాడు. ఆవిడ నడవడిక సరిగాలేదని వదంతు లున్నాయని, తిరిగివెళ్ళి సరిగా విచారించి రావాలని శంకర రావు సలహా యిచ్చాడు. తనకు నచ్చినదని, వివాహం చేసు కోడానికి నిశ్చయం చేసుకొన్నానని గోపాలం తిరిగి వ్రాసాడు. ఇక రహస్యం దాచిపెట్టుట ఎంతమాత్రము సరికాదని పార్వతి ఒకప్పుడు వ్యభిచారి; ఈవిషయుం తెలిసే నీవు వివాహానికి సమ్మతించావా? అని శంకర్రావు వ్రాశాడు.

అంతా తెలిసే చేసుకొంటున్నాను. పార్వతినితప్ప మరెవరినిగాని వివాహం చేసుకోను. అని గోపాలస్వామి ఖచ్చి తంగా ప్రత్యుత్తర మిచ్చాడు. శంకరరావు అతనిని ఎంతో అభినందించాడు. పెండ్లి ఏర్పాట్లు తీర్మానించుకొనేదానికి అతను శంకరరావు దగ్గరికివచ్చాడు. అలాంటి ఆవిడనే చేసు

కోవాలని ఎందుకండీ మీకు అంత పట్టుదల? అని అడిగాడు శంకరరావు.

స్వకుటుంబంలోనివాళ్ళు ఎన్ని తప్పులు చేసినా క్షమిస్తామండి, కాని యితరులు చేస్తే క్షమించమండి, అన్నాడు గోపాలస్వామి. ఎంత విశాలహృదయులండి మీరు, మీలో యీ గొప్ప పరివర్తన రావడానికి కారణం యేమండీ! అని అడిగారు శంకరరావు.

మా అక్కగారిని మీరు చూచారుకదా? నలభై సంవత్సరాలు వయసుంది. 12 ఏళ్ళకే వితంతు వయింది. ఎన్ని పాపాలో జేసింది. అన్ని క్షమిస్తూవున్నాము కుటుంబంలో. ఆకాలంలోనే ఆమెకు తిరిగి వివాహ మైవుంటే ఆమె జీవితం ఎంతో బాగుండేది అన్నాడు గోపాలం. అక్కగారి పాపాలన్ని యీ పెండ్లితో పరిహారం కావాలని ఆశిస్తున్నాను.

వివాహానంతరం పార్వతీ గోపాలులు చిలుకా గోరింకాల్లాగు జీవితం గడుపుచుండిరి. తాను వివాహాలు జేయించిన వారి ఇండ్లకు శంకరరావు వెళ్ళి దంపతుల కష్టసుఖాల్లో పాల్గొంటూవుండిరి. పార్వతీ గోపాలుల ప్రేమను వారి దాంపత్యాన్ని చూచి ఆ వివాహం జేయించినందుకు జీవితాంతవరకు శంకరరావు గర్వపడుచుండెను.



# దేశభక్తుడు

కోయంబత్తూరు జెయిలులో ఒక బెంగాలి టెరరిస్టుతో నాకు స్నేహితం కుదిరింది. ఒక బ్రిటిష్ పోలీసు ఆఫీసరును కాల్చివేసిన కేసులో, బోసుకు 15 సంవత్సరాలు, శిక్ష విధించారు. జైలునుండి వెలుపల పార్టీతో ఉత్తర ప్రత్యుత్తరాలను జరుపుచుండిరని, బెంగాలు గవర్నమెంటు తెలుసుకొని బోసును కోయంబత్తూరు జెయిలుకు పంపిరి.

టెరరిష్టులను గురించి, వారి సహసకృత్యాలను గురించి వారి త్యాగాల్ని గురించి అనేక కథలు నాకు చెబుతుండేవాడు. ఎన్నివిన్నా, ఇంకా వినాలనే కోరిక ఉంటూవుండింది.

ఒకరోజు న్యూసుపేపర్లో ఒక వార్త వచ్చింది. ఢాకా ఆయుధగారంమీద బెంగాలీ టెరరిష్టులు సాయుధపాణులై దాడిచేసిరి. పోలీసులకు వీరికి మధ్య జరిగిన కాల్పులలో, ఇరు పక్షాలలో కొందరు చనిపోయిరి. టెరరిష్టులలో అయిదుగురు మారణించిరి. ఈ అయిదుగురిలో, టెరరిస్టుల నాయకుడైన, సన్యాలు, అతనిభార్య వసంత వుండిరి. వసంత పురుషవేషంలో ఉండినది. తనభర్తకు గుండుదెబ్బ తగిలి పడిపోగానే సహాయంచేసే నిమిత్తం ఆమె ఆయనవద్దకు వెళ్ళినట్టును, దాగుకొని చూస్తూవుండిన పోలీసు లామెను కాల్చినట్టును వార్తాపత్రికలో వుండినది.

తోకత్రొక్కిన తాచులా, కోపోద్రిక్తు డయ్యాడు నా మిత్రుడు బోసు. అటూ ఇటూ తిరుగుతూ, విదేశీ ప్రభుత్వాన్ని తరిమివెయ్యాలని, విదేశ ప్రభువులను ఒక్కొక్కడిని కాల్చి గోరీ కట్టాలని అంటూవున్నాడు. కొంతసేపయిన తరువాత, మాట్లాడడం మానేసి కంటనీరు పెట్టుకొన్నాడు

మరునాడు కలుసుకొన్నప్పుడు, తన మిత్రులు, సన్యాలు దంపతుల ప్రేమగాథ చెప్పాడు. ఆకథ నాకు చాలనచ్చింది. ఎన్నో సంవత్సరాల తరువాత కూడ మరచిపోలేదు. దానిని ఇక్కడ వ్రాస్తాను.

సన్యాలు, కలకత్తా యూనివర్సిటీలో, కెమిస్ట్రీలో ఎమ్. ఎ. ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడు. అప్పటికే టెరరిస్టు సంఘంలో మెంబరు అయ్యాడు. తరువాత ఒక ముఠాకు నాయకుడయ్యాడు. చిన్నప్పుడే వివాహం అయింది. ఆ కాలంలో, విప్లవకారులు అందరిలాగే తానుకూడా తన భార్యను దేశభక్తురాలుగాను, టెరరిష్టుగాను మార్చాలని ప్రయత్నించాడు కాని సాధ్యపడలేదు. ఆమెకు సౌఖ్యంగా జీవించాలని ఆశయం. ఈలాంటి కష్టాలు, త్యాగాలు ఆమెకు నచ్చలేదు. తమ యింటికి పార్టీ మెంబర్లువచ్చి, తమ రహస్య కార్యకలాపాలేవో చేసుకుంటూండేవారు. సన్యాల్, ఏకదీక్షలో విప్లవకార్యాల్లో నిమగ్నుడయ్యాడు. భార్యసంగతే ఉపేక్షించివేశాడు. భర్త ఎంతమంచివాడైనా, ఎంతప్రేమ ఉండినా, తనను ఉదాసీనంగా చూస్తుంటే, అపార్థం చేసుకోవడమేగాక, తన ఇంద్రియ సౌఖ్యాలను తృప్తి పరచుకొనే మార్గము తోచక, వసంత విచారపడుతూ వచ్చింది.

తమయింటికి వస్తూవుండిన టెరరిస్టు యువకులతో, స్నేహం కలుపుకుంటూ ఉండింది. అందుకు భర్త సంతోషించాడు. ఎలాగైనా ఆవిడ దేశభక్తురాలైతే చాలునని, ఆయన ఆశ. తమ ఇంటికి వస్తూన్న యువకులలో, కొందరు గుణవంతులుకారు, అలాంటివారితో ఎక్కువ పరిచయం చేసుకుంటూ వారితో ముచ్చట్లాడుతూ, షికార్లుకొట్టుతూ వసంతకాలం గడపసాగినది.

ఒకరోజున ఆమె కనుపడలేదు. ఎవరితోనో లేచిపోయి వుంటుందనుకొన్నాడు భర్త. పార్టీ మెంబర్లు చాలా విచారపడ్డారు. తమ నాయకుని ఓదార్చుటకు ప్రయత్నించారు. బెనర్జీతో లేచిపోయి వుంటుందని తీర్మానించుకొన్నారు.

"నేను ఆవిడను చాలా ఉపేక్ష చేశాను;చిన్నవయసు; ఆమె హృదయాన్ని గురించి ఆలోచించనే లేను; దానిని గుర్తించనూలేదు. పాపం! ఏంచేస్తుంది" అని తన్నుతాను నిందించుకొన్నాడు భర్త.

"కొద్దిరోజుల్లోనే బెనర్జీమీద ఆమెకు విసుగు పుడుతుంది. వాడు ఆవిడను విడిచేస్తాడు: ఎంత తెలివితక్కువపని" అని ఒకరన్నారు. అవునంటే అవునన్నారు

"సన్యాల్ గొప్పతనంగాని, ఆయన దయార్ద్రహృదయంగాని, ఆయన అసమాన శక్తులుగాని, త్యాగంగాని,ఆమెకు బోధపడనేలేదు;ఆవిడపశువులాప్రవర్తించింది"అన్నారుఒకరు.

"చిన్నప్పుడే మనకు పెండ్లి చేస్తారు మనమేవో గొప్ప కార్యాలు చెయ్యాలని దీక్షపూనితే, ఈలాంటి ఆటంకాలు వస్తూవుంటాయి" అని మరొకరన్నారు.

"ఈలాంటి భార్యలను విసర్జించకపోతే, మనం దేశ విముక్తికోసం పని చెయ్యలేము" అన్నారొకరు.

సన్యాలుకు, ఈలాంటి సంకుచిత భావాలు నచ్చలేదు. "మనవాళ్ళని మనతో ముందుకు తీసుకపోతూ వుండాలి. మన స్త్రీలను దేశభక్తులుగాను, వీరాంగనలు గాను మార్చకపోతే, మన దేశవిముక్తి పూర్తి కాజాలదు"అని సన్యాల్ అన్నాడు. మిగిలినవారందరూ ఈ మాటలలో సత్యం ఉందని గ్రహించారు. కాని, ఒకరన్నారు "వసంత తిరిగివస్తే ఏం చెయ్యాలి?"

"అనుభవమనేది ఆమెను మార్చేస్తుంది. అప్పుడైనా, నే నెలాంటివాడినో తెలుసుకోవచ్చు. తప్పక నావద్దకు తిరిగి వస్తుంది" అన్నాడు సన్యాల్.

ఒక నెలరోజుల పిమ్మట, వసంత వచ్చివేసింది. భర్త కాళ్ళమీద పడ్డది. క్షమించమని కన్నీరు పెట్టుకొన్నది. తమ నాయకు డేమి చేస్తాడో అని సహచరు లందరూ ఆతురత పడుచుండిరి.

"వసంత! లే! స్వానుభవంతో, మానవస్వభావం గ్రహించావు. జ్ఞానివయ్యావు. ఇప్పుడు నీవు నాకు సరియైన భార్యవు కాగలవు" అని ఆమెను తన రెండుచేతులతో లేవనెత్తి కౌగలించుకున్నాడు, విప్లవ నాయకుడైన భర్త.

ఆయన విశ్వాసాన్నామె వమ్ముచెయ్యలేదు; భర్తతో పాటే, స్వతంత్రసంగ్రామంలో అసువులు విడనాడి అమరజీవి అయింది.

# అసలు కారణం

"రామస్వామి శెట్టిగారి వైఖరి, నాకేమీ బోధపడడంలేదు" అన్నది నా భార్య రమ?

"ఆయన వైఖరిలో మార్పు ఏమీ కనపడడంలేదే" అన్నాను నేను.

శెట్టిగారి కూతురూ అల్లుడూ మద్రాసులో నేఉన్నారే! మన యింటిలో బసచెయ్యడం ఎందుకు?

"అవును, దుఃఖం మరచిపోవడానికి మన యింటికి వస్తాడు! మన పిల్లలతో ఆడుకుంటాడు. మన పిల్లలకు బహుమతులిచ్చినప్పుడు, తన కూతురికి మనమడికి యిచ్చినట్టు భావించుకొని తృప్తిపడతాడు"

"మీమాటలు బోధపడడంలేదు. కూతురూ, అల్లుడూ ద్రవ్యవంతులు. ముచ్చటైన మనుమడు. నిక్షేపంలాంటి కుటుంబం. వారియింటికి ఎందుకు వెళ్ళరు"?

"తన యింటికి రావద్దని, కూతురు ఎంతో దుఃఖంతో తనతండ్రిని బ్రతిమిలాడింది. కూతురుమీద తండ్రికి, తండ్రి మీద కూతురికి అమిత ప్రేమ ఉన్నా, తండ్రిగౌరవం కాపాడడానికే ఆమె ఆసలహా యిచ్చిందట"

"నాకేమీ అర్థంకావడంలేదు. ఆరహస్యం ఏమిటో చెప్పుదురూ!" అన్నది రమ.

"వ్యాపారస్థుల యిండ్లలో, బంధువులకు జరిగే మర్యాద, వారి ఆస్థిపాస్తులను అనుసరించి వుంటుంది, ఆరహస్యం తెలియక కష్టాలపాలయ్యాడు నాస్నేహితుడు"

రామస్వామి బీదవాడైనంతమాత్రాన, తన యింటికి రావద్దన్నాడా, అల్లుడు?" అన్నది రమ?

"అంత మోటుగా అంటారా? ఎప్పటికీ అనరు"

ప్రత్తివారు ఇద్దరు అన్నదమ్ములు. రవల వ్యాపారం. మూడులక్షల ఆస్థి. పెద్దవానికి నూనేవారి కుమార్తెనుఇచ్చారు. పదివేల రూపాయల కట్నం ఇచ్చారు. చాలా వైభవంగా పెళ్ళి జరిగింది. వారికి ఇనుము వ్యాపారంలో బాగాకలిసి వచ్చింది. కూతురుకూ, మనుమడికీ ఎన్నో నగలు పెట్టారు.

ప్రత్తి వారి చిన్నవానికి, తనకూతురునిచ్చి వివాహం చేయిస్తే తన కూతురు సుఖపడుతుందనీ, తన హోదాగౌరవాలు పెరిగిపోతాయని, నా మిత్రుడు రామస్వామి ఒకప్లాను వేశాడు. తనఆస్థి ముప్పైవేలు మాత్రమేను. ఒకేకూతురు, ఒకేకొడుకు.

నూనెవారు ఇచ్చిన కట్నం పదివేలేకదా? నేను వారంత ద్రవ్యవంతుడిని కాదుగదా? నన్ను ఎక్కువ యిమ్మని అడగవచ్చునా? అని న్యాయంగా అడిగాడు నామిత్రుడు, ప్రత్తివాళ్ళని.

మీ బిడ్డను యిస్తానని మాయింటికి వచ్చారు. మేము అడిగేదేమో అడిగాము మీ యిష్టంవుంటే మంచిది; లేకపోతే మరొకరికి యివ్వండి. మేము అడ్డంరావడంలేదే!

అన్నారు- ప్రత్తివారిపెద్దలు. వ్యాపారధర్మం తప్పకుండా సూటిగా సమాధానం చెప్పారు-

"పెద్దబ్బాయికి కట్నం పదివేలు తీసుకొన్నారుగదా! పదిహేనువేలు నన్నెందుకు అడుగుతారో బోధపడడంలేదు? అయినా పదివేలు యిస్తాను అంగీకరించండి" అన్నాడు నా మిత్రుడు. చివరకు పన్నెండువేల అయిదువందలకు బేరం ఫయిసలు చేశారు బ్రోకర్లు-

నా మిత్రుడు చాల వైభవంగా, ప్రత్తివారి హోదాకు తగినట్లుగా ఖర్చుబెట్టాడు-తన ఆస్థిలో సుమారు పదిహేడు వేలు ఖర్చుఅయిపోయినయి. అయితేనేమి? కుమార్తె లక్షాధికార్ల యింటికోడలయిందని మురిసిపొయ్యాడు. వ్యాపారంలో కూడా, తన అదృష్టం తనవెంటనే ఉంటుందని అనుకొన్నాడు.

"భలే! రామస్వామిగారూ! నీవెంత అదృష్టవంతుడివి" అని కొందరు వర్తక శిఖామణులు పొగిడారు.

"ఇక మనలను లక్ష్యపెడతాడా!" అన్నారు కొందరు ఈర్ష్యతో-

"దీనితో వీడు దివాలా అవుతాడు" అని గుసగుసలాడారు, మరికొందరు బుద్ధిమంతులు-

## 2

ఒక్క సంవత్సరం, రాకపోకలు, ఇచ్చి పుచ్చుకోవడాలు, తృప్తికరంగా జరిగిపోతూవచ్చాయి. మామగారియిల్లు

సామాన్యమైన ఇల్లేగాని తమ భవనంలాంటిది కాదని, తన హోదాకు సరికాదని, అల్లుడు మామఇంటికి పోవడం మానేశాడు- తన భార్యను, తల్లిగారి యింటికి అన్ని నగలుపెట్టి పంపడంకూడా సరికాదేమోనని సంశయించ సాగాడు.

నూనెవారు తమ ఇనుప వ్యాపారంలో లక్షలు గడించారు-యుద్ధకాలం; బ్లాకుమార్కెట్. అలాగే ప్రత్తివారు కూడా. అందువల్ల నూనెవారు తమ అల్లునికి; బిడ్డకూ, మనుమనికి; నగలూ, బట్టలూ, బహుమతులు చాలా విరివిగా యిస్తూ వచ్చారు- వాటిలాగే వారిమధ్య అన్యోన్య ప్రేమ గౌరవాలు చాలా దినదినాభివృద్ధి చెందుతూ వచ్చాయి-

నా మిత్రుడు రామస్వామికి వ్యాపారం చేసుకోవడానికి రొఖ్ఖం చాలలేదు. లాభాలు తగ్గిపోయాయి. వచ్చినది యింటి ఖర్చులకే చాలడం లేదు. కూతురు జానకి మొదటి కాన్పుకు తల్లిగారి యింటికి వచ్చింది. చక్కని బిడ్డ కలిగాడు. నామకరణానికి అల్లుడు రాలేదు. అందరికి దుఃఖంవేసింది. కూతురిని తండ్రిగారే అత్తగారింటికి తెచ్చి విడిచాడు. మార్గమధ్యంలో కూతురు ఎన్నోమార్లు కండ్లనీరు పెట్టుకొన్నది.

పెద్దకోడలు పాపను ఎత్తుకొని "పాపకు తాతగారు పెట్టిన నగలు ఎక్కడే! జానకీ! పాపకు పెట్టవే! దిష్టితగలదు లే!" అన్నది. జానకి కంటనీరు పెట్టుకొని గదిలోకి వెళ్ళింది. నామిత్రుడు తల వొంచుకొన్నాడు-

"ఒరే! రాజా! తాతయిచ్చిన నగలు చూపించరా!" అని తనకొడుకుని పెద్దకోడలు అడిగింది. ఇరవై వేల నగలు ప్రదర్శించాడు తన రాజా!

"కాన్పుకు తల్లిగారింటికి వెళ్ళడం నీ తప్పా- మా వదినే ఏదో అన్నదని ఎందుకు ఏడవడం? మాయందరి పరువూ తీసేశాడు మీ తండ్రి. ఏదో విధంగా పది యిరవై నవరత్న నగలయినా పెట్టకూడదా?" అన్నాడు అల్లుడు.

పాప ఏడ్చాడు. వానిని ఎత్తుకొని ముద్దుపెట్టుకొంటూ "మీ తాత నగలు పెట్టలేదని ఏడవద్దులే! నేను పెట్తాలే!" అన్నాడు అల్లుడు-

భోజనాలవద్ద, "రాండి! కూర్చోండి, మామగారూ" అని మాటవరసకైనా మర్యాద చెయ్యలేదు- వంటవాడు పీట చూపించాడు- కడపటి పీటమీద కూర్చున్నాడు, రామస్వామి శెట్టి-

జానకి, గదిలో కంటినీరు పెట్టుకొంటూ వున్నది-"నేను వెళ్తాను, అమ్మణ్ణి" అని తండ్రికూడా కంటనీరు పెట్టుకొన్నాడు- గుమ్మము వరకూ సాగనంపింది, జానకి-

# వ్యామోహం

"మూర్ఛ చాలా తీవ్రంగా వచ్చింది. కాని ఫరవా లేదు" అన్నాడు డాక్టరు.

"ఇంతకు ముందు, రెండుసార్లు వచ్చింది, కాని ఇంత తీవ్రంగా లేదు మరి..." అన్నాడు శ్రీ సీతారాంరాజుగారు.

"కూతురు మిమ్మల్నందరిని ధిక్కరించి అతివాదిని పెండ్లి చేసుకొన్నప్పుడు ఒకసారి వచ్చింది. నాకు తెలుసు కాని, రెండవమారెప్పుడు ?"

"మా అబ్బాయిని జెయిల్లో వేసినప్పుడు కూడా తీవ్రంగానే వచ్చింది" అన్నాడు భర్త.

ఇప్పుడు అంతకంటే తీవ్రంగానే వచ్చింది.

"ఈలావస్తుంటే హఠాత్తుగా చచ్చిపోతుందేమో, డాక్టరుగారూ ?"

అంత మాత్రానికే చచ్చిపోదు కాని నీరసించి పోతుంది. పాపం !

ఆమె మాత్రం ఏమి చెయ్యగలదు! తాను ఎన్నో సంవత్సరాలుగా మనసులో నిర్మించుకొన్న ప్రపంచం ఒకటి. ఇప్పుడు జరిగేది మరొకటి. అంతా తారుమారు అయి పోయింది మరి! అన్నాడు శ్రీ సీతారాం రాజుగారు. చాలా

విచార గ్రస్తుడయ్యాడు. ఓదార్చాలనే ఉద్దేశంతో డాక్టరు గారు.

అందరికీ ఏవో కష్టాలు, ఆశాభంగం, కలుగుతూ వున్నాయి. ఈ కాలంలో అందరి మనసుల్లో అశాంతి ఆవేదన తప్ప మరేముందని? కాని, ఏలాగో, కొంత విరక్తి వహించాలి. లేకపోతే, ఆమె పిచ్చిదయి పోతుంది.”

“అలాగే అంటారు నా స్నేహితులు, ఆమె స్నేహితులు. వారిలో కొందరు డాక్టర్లుకూడాను. నేనెంత చెప్పినా ఆమె స్థిమితం తెచ్చుకోదు అన్నాడు భర్త.”

“అంత విద్యావతి. పాశ్చాత్యదేశాలు పర్యటన చేసింది. గొప్ప జాతీయసంస్థలకు అధ్యక్షురాలు. గాంధీజీ కూడా ఆమెను గౌరవిస్తారు జైలుకుకూడా వెళ్ళివచ్చింది. ఆమె ప్రయత్నిస్తే స్థిమితం తెచ్చుకోగలదు” అన్నాడు డాక్టరుగారు.

“మహాత్ముడే కాదు. గవర్నర్లు, వైస్రాయిలుకూడా ఆమెను గౌరవించుతారు. అందరిచేత మంచిదనిపించు కొన్నది. ఈ మూర్ఛరోగంతో క్షీణించిపోతూ వుంది” అన్నాడు భర్త.

“ఇప్పుడు ఆమెను ఇంతగా తారుమారు చేసిన విషయం ఏమిటి?” అన్నాడు డాక్టరు.

“మా కూతురు, సరోజ. ఒక కంపెనీలో అసిస్టెంటుగా చేరింది. ఎంత బ్రతిమలాడినా, లక్ష్యపెట్టక, ఇప్పుడే వెళ్ళిపోయింది. తన సామానులుకూడా తీసుకెళ్ళింది.”

"కంపెనీలో చేరడమే! అమెరికాలో ప్యాసయి వచ్చిందే: ప్రొఫెసరుగా చేరకూడదా? జీతానికి నౌకరీ చెయ్యవలసిన అవసరం ఏమివచ్చింది? మీరు, ఎంతైనా ఆమె ఖర్చుకు యివ్వగలరే!"

"మా ఇంటిలో తనకు స్వతంత్రం లేదట! తనభర్త అజ్ఞాతవాసంలో ఉన్నారు. మీకు తెలుసు. అతనితో కలసి వున్నారు; తన సహచరులు. వీళ్ళ భార్యలకు తిండికి లేదట. వారిని పోషించాలట."

"ఎంత జీతం యిస్తారు?"

"నెలకు రు 250."

"అంత జీతమే!"

"కంపెనీవాళ్ళు స్వార్థపరులు. నేను తిరిగి మంత్రినౌతానని అనుకుంటున్నారు."

"ఎంత తీవ్రమైన మార్పులు వస్తున్నాయండి. తల్లిదండ్రుల లోకమార్గం: బిడ్డలు వ్యతిరేకమార్గం. మన దేశంగతి ఏమౌతుందో?"

నర్సువచ్చి ఆమె తేరుకున్నదని చెప్పింది. ఇద్దరూ ఆమెగదిలోకి వెళ్లారు.

"గుడ్ మార్నింగ్; కమలాబాయిగారూ!" అన్నాడు డాక్టరు.

"గుడ్ మార్నింగ్, డాక్టర్"

"కమలాబాయిగారూ! మీరు నాతో సహకారం చెయ్యకపోతే ఎలాగు?" అన్నారు డాక్టర్.

"మీరిచ్చిన మందులూ టానిక్కులూ పుచ్చుకుంటూ నేవున్నా. ఇంతకంటే మరేమి చెయ్యమంటారండీ."

ఈవ్యాధి మందులతో నయమయ్యేది కాదు. మానసిక వ్యాధి మనసు శాంతంగా ఉండాలి. ఎంతమాత్రం వ్యాకులం ఉండకూడదు."

"నాదుఃఖాలు నేను మరవలేను. చచ్చిపోతే బాగుండును" అన్నది కమలాబాయి.

"ఈకాలంలో ఎవరి జీవితం సుఖంగా గడుస్తున్నదమ్మా! అందరికి ఏవో కష్టాలుంటూనే వుంటాయి. కాలమహిమ. అందులో. ముఖ్యంగా. స్వవిషయాల్ని గురించి అస్తమానం ఆలోచించటం మంచిది కాదండీ. స్థిమితం తప్పిపోతుంది!" అన్నాడు డాక్టరు.

"డాక్టరు గారూ! కని పెంచిన తల్లికి తెలుస్తుంది ఈ ఆవేదన. ఎంతో ప్రేమతో పెంచాను. లక్షల ఆస్థి ఏమి కావాలి? చివరకు. నా బిడ్డలిద్దరికీ పుట్టింది ఈ దుర్బుద్ధి, నా ఆశలన్నీ నిరాశలై పోయాయి......మాబంధు మిత్రులందరూ గొప్ప పదవులలో వున్నారు. అసలు మాది పరిపాలక వర్గం... ...చివరకు చూడండి సరోజ గతి. గుమాస్తా నౌకరి... అబ్బ! తలపంపులు భరించ లేనండి... ...ఇక ఏ క్లబ్బుకు వెళ్ళగలను? ... ...ఏ మీటింగుకు పోగలను? ... ... ఏ విందులో పాల్గొనగలను? ... అంతేకాదు? నాభర్త... ... శత్రువర్గంవారు ఆయన్ను పైకి రానిస్తారా? మాకష్టాలు మీకు అర్థంకావు డాక్టరుగారూ!" అన్నది.

"నా విషయం అందరికీ తెలుసు: గాంధిగారికి తెలుసు! వైస్రాయికి తెలుసు: నాముత్తా రాజకీయాలవారేమో నన్ను సంశయించరు. నానిజాయితీని వారేలాగు అనుమానిస్తారు? ... నాబిడ్డలు తప్పుదారిని వెళ్ళితే, నేనేలా బాధ్యుణ్ణి? ... నాభార్య ఊహ సరికాదండీ! అన్నారు శ్రీ సీతారాం రాజుగారు.

అవునండి. మీరు చెప్పినదంతా సరిగానే వున్నది. మీ సంగతి అందరికీ తెలుసు. కాలానుగుణ్యంగా మీరు మారుతారు. మీకెంతో ధైర్యముంది. ఆలా మారగలరా, ఇతరులు?" అన్నాడు డాక్టరు.

"నేనేకాదు: నా భార్యకూడా అలాగే కులం మతం బంధువులను వదలివేసింది. లిబరల్ పార్టీని వదలి కాంగ్రెసులో చేరింది. నేను ఇండిపెండెంటు పార్టీని స్థాపించినప్పుడు, మా స్నేహితులు మాకు విరోధులయ్యారు. ఆవిడగాని నేనుగాని ఎంతమాత్రం లక్ష్యపెట్టలేదు. మహాత్మా గాంధీగారి ఉద్యమమే దేశానికి శ్రేయస్కరమని తోచినప్పుడు మేమిద్దరమూ దానిలో చేరిపోయాము. ఖద్దరు కట్టాము. జెయిలుకు కూడా వెళ్ళివచ్చాము. ఎలక్షన్లలో కాంగ్రెసును గెలిపించాము" అన్నారు సీతారాం రాజాగారు.

"అవును కాలానుగుణ్యంగా మారాలి. మన ఆదర్శాన్ని అందుకోటానికి ఎన్ని కష్టాలైనా పడాలి. విధాకర్మమా? కమలాబాయిగారూ? మీమనసును, మీఆలోచనలను స్వాధీనంలోకి తెచ్చుకోవాలి!" అన్నారు డాక్టరు.

"మొన్న వైస్రాయిగారి విందుకు వెళ్ళా. వారు నన్నెంతో ఆదరించారు. నా ఇద్దరు బిడ్డలూ ఈలాగు పాడై

పోయినందుకు, అతను అతని భార్య ఎంతో విచారపడ్డారు; ఏంతో సానుభూతి చూపించారు ఎంతమాత్రమూ అపార్థం చేసుకోలేదు. నాకొడుకు ఎంతగొప్ప ఉద్యోగంలో ఉండవల సినవాడు జయిల్లో ఉన్నాడే అని ఎంతో సానుభూతి చూపించారండీ, వాళ్ళిద్దరూ!" అన్నది శ్రీమతి సీతారాం రాజాగారు.

"మనందరికీ మార్గదర్శకుడు గాంధీగారే! ఆలాంటి మహాత్ముని కడుపున ఏలాంటిదుర్మార్గుడు పుట్టాడో చూడండి. అయితే ఆయన చలించాడా? స్వార్థత్యాగి. మహాత్ముడంటే ఆయన కేసరి!" అన్నాడు డాక్టరుగారు.

"బాపూజీని ఢిల్లీలో ఇటీవలనే కలుసుకొన్నాను. ఆయనకూడా మీలాగే సలహాయిచ్చాడు అన్నది. ఏమన్నా రండీ!" డాక్టరు అడిగారు.

"నాబిడ్డల యోగక్షేమాలడుగుతూ కమలా! నీకొడు కెంత మంచివాడమ్మా! వాడంటే, నాకెంతో నచ్చుతుంది." అన్నారు బాపూజీ.

"బాపూజీ! మీరు మావాణ్ని సన్మార్గంలో పెడతా రని ఎంతో ఆశపడ్డాను. అంటిని"

"మీవాడు తానునమ్మిన ధర్మాన్ని ఆచరిస్తున్నాడు. మానవసేవ చేస్తున్నాడు. వానిలో స్వార్థం క్షీణించిపోతూ వున్నది. చాలామంచివాడు అని బాపూజీ అన్నారు."

"వాడు విప్లవవాదుల ముఠాలో చేరిపోతే, మానవ సేవంటారేమండీ అని నే నన్నాను."

"స్వానుభవంతో ఏమార్గం సరియైనది తెలుసుకుంటాడు. భయపడవద్దు. నా కొమాళ్ళకు నేను అలాగే స్వతంత్రం యిచ్చాను అన్నారు బాపూజీ.

"అప్పుడేమో నేనేమీ అనలేకపోయాను. కాని, తరువాత హోటల్లో ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తే, బోరున ఏడుపు వచ్చింది" అన్నది లేడీ సీతారాం.

"అమ్మా! గాంధిగారి సలహా అనుసరించటం మంచిది. మీకూనాకూ అందరికీ కూడా. ఈకాలంలో పిచ్చి ఎత్తకుండా వుండాలంటే ఆయనలాగు స్వార్థం మానెయ్యాలి. నా బిడ్డలు, నా బిడ్డలు అనుకోవడం మానెయ్యాలి" అన్నాడు డాక్టరు.

"ఎంత ఆస్తి ఏలాంటి అంతస్థు! ఎంత పలుకుబడి! ఏలాగు మానెయ్యడం! నేనెంత ప్రయత్నించినా నా మనసు ఒప్పుకోవడంలేదు" అని కన్నీరు పెట్టుకొన్నది.

"ధ్యానం చెయ్యండి. రోజూ రెండుమూడుసార్లు; ముఖ్యంగా ఉదయం, మెలుకువ రాగానే ఒకసారి; రాత్రి నిద్రపొయ్యేముందుగా మరొకసారి, లేకపోతే ఈలాంటి జబ్బు నయంకాదు. ఏమంటారు." సీతారాం రాజాగారూ!

"అవునవును. మనసును స్వాధీనం చేసుకోవాలి. లేకపోతే మా మతాల రాజకీయాలతో, నాకిదివరకే పిచ్చిపట్టి వుండేది." అని నవ్వాడు ఆమె నిట్టూర్పు విడిచింది.

"No hope" అని గొణుగు కొంటూ వెళ్ళారు డాక్టరుగారు.



# త్యాగి

కన్ననూ, నేనూ, తిరిగి జైలులో కలుసుకున్నాము. గాంధీగారి పుణ్యమా అంటూ, మేము జైళ్ళలోనే స్నేహితులమయ్యాము. కన్నను మళయాళి. తెల్లదొరల గవర్నమెంటును విపరీతంగా ద్వేషించేవాడు. గాంధీగారికంటే ఎక్కువమార్లు జైలుకు వెళ్ళాడు. జయిళ్ళ అధికార్లతో పోట్లాడి శిక్షలు అనుభవించినవారిలో కన్నను ప్రథమ శ్రేణిలోవాడు.

1939 వ సంవత్సరంలో యుద్ధం ప్రారంభం కాగానే కన్నను, నేను, ఇంకా అనేకమంది స్నేహితులం. మూటముల్లె తయారు చేసుకొని, జెయిలు ప్రయాణాలకు సిద్ధమయ్యాము ప్రతి జిల్లానుండి నా మిత్రులు వచ్చారు.

జెయిలులో కన్నను, నేనూ ఒకేగదిలో వున్నాము. పరప్రభుత్వమైనా మాకు కొన్ని సౌకర్యాలు చేయక తప్పింది కాదు. ఆ సౌకర్యాలలో ఒకటి మా కుటుంబాలకు భరణం యివ్వడం. మేము సుమారు 200 మందిలో, భరణం కొరకు అప్లికేషను పెట్టుకొననిది కన్నను ఒక్కడే.

"ఒరే! తంబి! నీవెందుకు అర్జీపెట్టవు?" అంటిని.

"నాకు ఎవరూలేరు" అని నవ్వాడు. కాని ఆనవ్వు సహజంగా ఉండలేదు. కారణం తెలుసుకోవాలనికుతూహలం కలిగింది.

"ఎవరూ లేరా? భార్యకూడా లేదా?" అన్నాను. మన దేశంలో 35 సంవత్సరముల వయసుగల మగవానికి పెండ్లి తప్పకుండా అయ్యేవుంటుందని నా నమ్మకం.

"నాభార్య విడాకులిచ్చింది" అన్నాడు. కళకళలాడే ముఖం ముడుచుకపోయింది. నాకు ఆశ్చర్యంవేసింది. చాలా జాలికూడా కలిగింది. అయినా, కన్నను నాప్రాణ స్నేహితుడు. జెయిళ్ళలో, నా కష్టాలు తనకష్టాలుగా భావించి సహాయం చేస్తూవుండేవాడు. కాబట్టి వివరాలు తెలుసుకోవాలని బుద్ధి పుట్టింది.

"ఎందుకు అలాచేసింది?" అన్నాను.

"నేను పోషించలేకపోయాను."

"ఎందుకు పోషించలేదు?"

"నాకుగాని, ఆవిడకుగాని ఆస్థిపాస్తులు లేవు. నేను జెయిళ్ళకు పలుమార్లు పోవలసివచ్చేది."

"ఆమెకు తల్లిదండ్రులు లేరా?"

"తండ్రి ముసలివాడు. పద్మ ఒకేకూతురు. నేను, ఆవిడ, చిన్నప్పటినుండి స్నేహితులం, ప్రేమించుకొన్నాము. వివాహం చేసుకొన్నాము. నేను ప్రయమరీ స్కూలు హెడ్ మాష్టరుగా వుండేవాడిని. నేను వారియింటిలోనే వుండి యిద్దరినీ పోషించాను. నేను జెయిలుకు రావడంతో వారికి భోజనానికి లేకపోయింది."

"నిన్ను వదిలి వెయ్యగానే వారిపొట్టలు నిండి పోయాయా?"

"ఆవిడను మరొకరికిచ్చి వివాహం చేయించాడు, మామా మ."

"మరొకరికిచ్చి వివాహం చేయించడమే! ఆవిడ ఏలాగు ఒప్పుకున్నది? నీవు చెప్పేది చాల ఆశ్చర్యంగా వుంది!" అన్నాను.

"నీకు అలాగే వుంటుంది. మామామకు నెలకు పది రూపాయలు పెన్షను. పద్మ సంపాదించజాలదు. నగలు వగయిరా అమ్మేసి తిన్నారు ఆకలిబాధ యెన్నో నీచాలకు దారితీస్తుంది.

"పద్మా, నీవూ ప్రేమించుకొన్నారంటివే?"

"అవును, నుయ్యో గొయ్యో చూచుకొనుటకు ప్రయత్నించింది. ఆత్మహత్యను తప్పించి, తండ్రి రక్షించాడు! ఒక భర్తను వదిలివేసి తిరిగి వివాహం చేసుకోవడం అనే ఆచారం మాలో ఉంది. కాని మర్యాదస్తులు సాధారణంగా చెయ్యరు"

నా కంటిలో నీరుకమ్మింది. ఈలాంటి దుఃఖకరమైన వార్తలు వింటానని అనుకోలేదు. తానేమో ముఖం త్రిప్పి, తల వంచుకున్నాడు. అతని హృదయాన్ని నేను కలియబెట్టినందుకు విచారపడ్డాను.

"ఈలాంటి విషయాలు జ్ఞాపకం తెచ్చాను. ఎంత తెలివితక్కువ! క్షమించు." అని ఓదార్చసాగాను.

"నీవుచేసిన తప్పేమీలేదు. ఈలా ఒకప్పుడయినా దుఃఖం వెళ్ళబోసుకోడం మంచిదేగా" అన్నాడు కన్నన్.

"మీరిద్దరూ ఇంకా ప్రేమించుకొంటున్నా రనుకుంటాను."

"ఆవిడగాని నేనుగాని చేసినతప్పు ఏమున్నది? దరిద్ర మనేది ఒకవైపు, దేశభక్తి మరొకవైపు..."

"విడాకులిచ్చి ఎన్ని సంవత్సరాలయింది?"

"అయిదు"

"ఈలోగా ఎప్పుడయినా కలుసుకుంటిరా?"

"నేను విడుదలవగానే, ఆవిడ నన్ను కలుసుకునేది. కలుసుకోవద్దని యెంతచెప్పినా వినదు. నాకు చాలా ఇష్టమైన ఫలహారం చేసి తెస్తుంది. తినేవరకు, వెళ్ళదు. కండ్ల నీరుపెట్టు కుంటూ చూస్తావుంటుంది."

"నీవు ఆమెకు సహాయం చెయ్యనందుకు నిన్ను నిందిం చదా?"

"నన్ను యెక్కువగా నిందించదు. గాంధీ తనకొంపకు కొరివిపెట్టాడు అంటుంది."

"గాంధీ పెట్టలేదు. తెల్లదొరలు పెట్టారు" అని నేనంటే, తెల్లదొరలు మాకేమీ పెట్టడంలేదే అని సమా ధానం చెప్తుతుంది. ఇంకా ఎంతకాలము ఈలాగు జెయిళ్ళలో అని అడుగుతుంది.

"అందుకేమి చెప్పావు?"

"స్వరాజ్యం ఇదిగో వస్తుంది; అదిగో వస్తుంది అని సమాధానం చెప్తుతూ వుంటాను. నిట్టూర్పు విడిచి, కండ్ల నీళ్ళు తుడుచుకుంటుంది."

వారిద్దరికి ఎంతగాఢమైన, పవిత్రమైన, ప్రేమ! ఇంకనూ. ప్రశ్నలు వేసి నా మిత్రుని కలవర పెట్టకూడదని ప్రసంగం చాలించివేశాను.

కొంతకాలానికి, ఉత్తరం వచ్చింది. పద్మ వ్రాసింది; తనభర్త చచ్చిపోయ్యాడని. దుఃఖంగా వుండినాడు. "సంతోషం చూపకుండా, దుఃఖిస్తున్నావేమి!" అని అంటిని,

"పద్మ తిరిగీ పస్తుండాలికదా ? తిరిగీ మరెవరికి ఆవిడ తండ్రి కట్టిపెట్టాడో" అన్నాడు. కొంతసేపటికి "ఈయుద్ధం ఎప్పుడు పూర్తి అవుతుంది? మనకెప్పటికి విడుదల అవునో గదా!" అన్నాడు. నా ప్రాణస్నేహితుని మనసులో ఆలోచనలు విదితమయ్యాయి.

మరి కొన్నాళ్ళకు తండ్రికూడా చనిపోయ్యాడనీ, ఇడ్లీ దోసెలుచేసి ఫ్యాక్టరీ కూలీలకు అమ్మడం నేర్చుకున్నాననీ, కూలీలు తనను ఆదరించుతున్నారనీ వ్రాసింది. "నీవు యెప్పుడు విడుదలై వస్తావు అని కూలీలు అడిగారు" అని వ్రాసింది. కూలీనాలీ చేసి జీవించడం నేర్చుకొన్నందుకు ఎంతో సంతోషించాడు అందుకు ఆమెను అభినందించుతూ వ్రాశాడు.

"ప్రపంచయుద్ధం పూర్తి కావచ్చింది. అయినా మన స్వాతంత్ర్యపోరాటము పూర్తి కాలేదు. మనకు విడుదల సూచన కనుపడదు. మనము జెయిల్లోనే చచ్చిపోతామూ!" అన్నాడు కన్నన్ జెయిల్లోనుంచి తప్పించుకపోతే బాగుండునని నేను సూచించా.

"అలా చెయ్యడం తప్పు. గాంధిగారి నాయకత్వం క్రింద మనము పోరాడునంతకాలము, మననాయకుని ఆదేశం ప్రకారం ప్రవర్తించడం మంచిది. మన బంధువులు, భార్యా

బిడ్డలు కష్టపడుచున్నారని, మనదేశానికి చెయ్యవలసిన ధర్మాన్ని తప్పకూడదు" అన్నాడు.

ఎన్నో దుఃఖసమయాల్లో కూడ, దేశభక్తికే నా మిత్రుడు ప్రథమస్థానం ఇవ్వడం, నాకు అనుభవమే. అలాంటప్పుడు నేను సిగ్గుపడేవాడిని. అయినా వేళాకోళానికి "నీకు బయట ఎవ్వరూ లేరు. జెయిలే నీకు ఇల్లుఅయింది. స్వరాజ్యం వచ్చినా, నిన్ను జెయిలునుండి నెట్టివేసినా వెళ్ళవేమో!" అంటిని.

"స్వరాజ్యం రాగానే మన బాధ్యత పూర్తికాజాలదు. నాలాంటి బీదజనం యెందరో ఉన్నారు. వారికి మనం చెయ్యవలసిన సేవ ఎంతోవుంది" అన్నాడు.

"అవును. స్వరాజ్యంలో బీదలకు అనుకూలాలు చెయ్యగలం. తిరిగి జెయిలుకు రావలసిన గతిపట్టదు" అంటిని.

చిరునవ్వు నవ్వాడు, కాని సమాధానం చెప్పలేదు. నా మిత్రుడు నిరాశావాది అయ్యాడనుకొన్నాను

ఐదేళ్ళు జెయిలులో గడిచాక, విడుదల అయింది. తన గ్రామంలోని చుట్టుపట్ల గ్రామాల్లోను కన్ననుకు గొప్ప స్వాగత మిచ్చారు. ఊరేగింపులు చేశారు. తాను సంకల్పించిన కార్యం నెరవేరినందుకు తానేదో ఉడతా భక్తిలాగు చేసిన సేవకు తృప్తి పడ్డాడు

పద్మ కలుసుకొని, "భోజనానికి రా, పోదాం!" అని పిలుచుకవెళ్ళింది. భోంచేస్తూ వుండగా "ఇకనీవు నన్ను విడిచి పెట్టి జయిలుకు వెళ్ళవుగదా!" అని అడిగింది. ఎంతో ప్రేమతో చిరునవ్వుతో "వెళ్ళను" అన్నాడు కన్నన్.

"ఏలాగు జీవించడం!"

"మనరాజ్యం వచ్చిందిగదా! యేదో వుద్యోగం చేసుకుంటా."

"తిరిగి హెడ్‌మాష్టరు ఉద్యోగం సంపాదించు" అన్నది పద్మ. ఆవిడ అమాయకత్వానికి నవ్వాడు.

ఆరాత్రి పండువెన్నెల, పద్మ కౌగిలిలో హాయిగా పడుకున్నాడు. "యెంతకాలానికి తిరిగీ ఈ అదృష్టం! పదిసంవత్సరాల తరువాతనా!" సగం రాత్రిలో ఉలిక్కి పడ్డాడు. పద్మ నిద్రలేచి "కన్న! ఏమేమి జ్ఞాపకం వచ్చింది? దుఃఖాలు, కష్టాలు మరచిపో" అని గట్టిగా ఆలింగనం చేసుకొని, ఓదార్చింది.

కాని, కన్ననుకు నిద్రపట్టలేదు తనలో పూర్తి నమ్మకంతో నిద్రలోకూడా సంతోషంతో ఉండిన తన ప్రేయసి ముఖం చూచి, తమ బీదతనం, అందువల్ల ఆమెపడిన కష్టాలు జ్ఞాపకం తెచ్చుకుని కంటనీరు పెట్టుకొన్నాడు, నిద్రపట్టింది.

తిరిగీ దుస్వప్నం ... మరచిపోవాలనుకొని, కండ్లు మూసుకొన్నాడు. కాని, ప్రజలను ఆవరించిన దారిద్ర్యం అనే పెనుభూతం నిద్రపోనివ్వలేదు.



# బారిష్టరు మామ

మానాన్న చనిపోయినప్పుడు, సానుభూతి ఉత్తరాలు నాకు చాలావచ్చాయి. అన్నిటిలోకి మా బారిష్టరుమామ వ్రాసిన ఉత్తరం, నన్ను చాల ఆలోచించేట్టుచేసింది. "మామ" వాస్తవంగా మామ కాదు. అయినా స్వంత మామలకంటే చాల దగ్గరివాడు.

"నా ప్రియమైన రామూ!

నా ప్రాణ స్నేహితుడు, మీనాన్న. చనిపోయాడని ఎంతో దుఃఖంగావుంది. బాల్యంనుండి మాయిద్దరికి స్నేహం... ...ఆయన జీవిత దృక్పథంవేరు... నాది వేరు. మాలోమేము తర్కిస్తూ, విమర్శించుకుంటూ, ఖండించుకుంటూ ఉండే వాగం. కాని, మా అభిప్రాయభేదాలు మాస్నేహాన్ని బాధించలేదు... తాను జీవితంలో సౌఖ్యంఅనుభవించనేలేదు. అందరికష్టాలు తనవే ననుకొని... చివరకు బోలెడు ఆస్తిని తగులబెట్టాడు... తనకూ తనకుటుంబానికి లభించిన లాభ మేమో, పూజ్యం...

నీ మామ"

ఈ ఉత్తరం చదవగానే నాకు ఆశ్చర్యం వేసింది. పట్టరాని కోపంకూడా వచ్చింది. "మానాన్న ఎక్కడ? ఇత నెక్కడ? మానాన్న దేశభక్తుడు! త్యాగి! పరోపకారి! మా

నాన్న పాదధూళికైనా సమానుడు కాడు. ఇతనా, వేరే కులంలో పెండ్లి చేసికొన్నంత మాత్రాన గొప్పవాడైపో యాడా? స్వకులంలో మంచి రంగు గలవాళ్ళు వయసు వచ్చి నవాళ్ళు దొరకడం దుర్లభమని చేసికొన్నాడు? ఇతనా మా నాన్నను విమర్శించ గలవాడు? రాను రాను స్వార్థం కరుడుగట్టి పోతున్నది!" అని ఆశ్చర్యపడ్డాను.

నా బాల్యంలో బారిష్టరు మామ, నాకు ఆదర్శ వీరుడు, అప్పుడే వివాహం చేసుకొని, భార్యతో మాయింటికి వచ్చాడు. బంధువులు ఆయన్ని బహిష్కరించారు. కాని మామ లక్ష్యపెట్టనేలేదు. అప్పుడు చాలమంది ఆయనను, ముఖ్యంగా ఆయన భార్యను చూడాలని మా యింటికి వచ్చారు.

మామ చాల హాస్యగాడు ఒకబీద బాల్యస్నేహితుడు రాగానే "ఏమోయ్! నారాయణ! నాభార్యను చూడటానికి వచ్చావు! ఆసంగతి చెప్పడానికి సిగ్గుపడుతున్నావు. అవతలి గదిలోవుంది చూచిరా!" అన్నాడు.

చూచిరాగానే "ఏం! ఏలాగుంది? కోమటి పిల్లలా లేదా!" అని పరిహాసం చేశాడు.

'నగ లేమీ లేవే!" అన్నాడు ఆవర్తకుడు? "చిల్లర బేరాలు చేసేవాళ్ళకి, చిల్లరగా ఆలోచనలు తప్ప గొప్ప విషయాలు ఏలా తోస్తాయి? నీకోమటి కళ్ళకు నగలు మాత్ర మేకనపడతవి. ఆవిడఅందంగాని, గులాబిరంగుగాని, కళకళ లాడే ముఖంకాని, ఉంగరాల వెంట్రుకలుకాని, నీకండ్లకు కనుపడనేలేదు. కవులు, పండితులు, నవరసాలు ఉన్నా

యంటారు. మీలో పదో రసం వొక్కటే—ధనమోహం - ఉందని వారికి తెలియనే తెలియదు,"అని పరిహాసంచేశాడు. అందరూ పకపక నవ్వారు. మా మామ నాకు హీరో అయ్యాడు.

మరునాడు, చాల ద్రవ్యవంతుడైన స్నేహితుడు వచ్చాడు. తాను ద్రవ్యవంతుడని గర్వపడడమేగాక, తన అహంభావాన్ని, ఇతరులను కించ పరచడంలో, ఏలాగో కనుపరుస్తాడు. "బారిష్టరుగారు! ఆస్థినీ, బంధువులను, త్యజించావు. సంసారం ఏలాగు పోషిస్తావు?" అన్నాడతను.

"నాకేమోయ్! నేను బారిష్టర్ని. ప్రాక్టీసు చెయ్యగల! ఉద్యోగంలో చేరగల! ప్రొఫెసరుపని చెయ్యగల! జర్నలిష్టు కాగల! కంపెనీలలో మేనేజరు కాగల! మీలాగుకాదే! మీకు తల్లిదండ్రులు యిచ్చిన ఆస్థి లేకపోతే, దేనికి పనికి రారు. ఆఖరుకి గుమాస్తా పనికిగాని, వంటపనికి కూడా పనికి రారు, నీవూ నేనూ ఢిల్లీ క్లిపోదాం! నీనెత్తిన వొక్కరూపాయి పెట్టి యాలాంవేస్తే, ఆ రూపాయకంటె ఎక్కువపెట్టి కొనరు. నా ద్రవ్యమంతా నా మెదడులో ఉంది" అని ఆ లక్షాధికారి పొగరు అణచివేశాడు. అందరం నవ్వాము. మామలాగు నేనూ బారిష్టరు కావాలనుకొన్నాను

"ఇక నీప్లాను ఏమిటోయ్" అడిగాడు మానాన్న. "నేను విదేశ సర్కారుకు ఉద్యోగం చెయ్యను. వారి కోర్టులలో ప్రాక్టీసు చెయ్యను" అన్నాడు మామ. "అయితే ఏమి చేస్తావు ?"

"టాటా కంపెనీలో రు 250 తో ప్రారంభం చేస్తామన్నారు. రిటైర్ అయ్యేకాలానికి రెండువేల రూపాయల వరకుజీతం పెరగవచ్చు" అన్నాడు మామ.

"సరే! దంపతు లిద్దరూ భోగభాగ్యా లనుభవిస్తారన్న మాట. అయితే నీభార్య విద్యావంతురాలేనా?"

"ఇంగ్లీషు S. S. L. C వరకు చదివింది. ఇంటిదగ్గర ఇంకా చదివిస్తాను. వీణ చెప్పిస్తాను ఆంధ్ర స్త్రీలలో ప్రథమ స్థానానికి వచ్చేలాగు చేస్తాను."

"ఓహో! అదా నీ ఆశయం! ఏదో కులంనుండి, కట్నం నుండి తప్పించుకొన్నావు. ఏదో కాస్త దేశసేవ, మానవసేవ విషయంలోకూడా ముందంజ వేస్తావనుకొన్నా, కాని...

నేను సౌఖ్యం అనుభవిస్తూ, దేశసేవ కూడా చేస్తాను" అన్నాడు బారిష్టరు మామ.

"అలా సాధ్యం కాదేమో!" అన్నాడు మానాన్న.

## 2

పది సంవత్సరాలు గడిచాయి. దేశంలో త్యాగం చెయ్యగలవారు, దేశభక్తులూ వేలులక్షలు గాంధిగారి నాయకత్వం క్రింద దేశవిముక్తి కొరకు పాటుపడ్డారు. ఆస్థులు ఆరోగ్యాలు పోగొట్టుకొన్నారు. మానాన్న గాంధి శిష్యుడయ్యాడు. ఆయన ఆజ్ఞ తు. చ- తప్పకుండా నెరవేర్చారు.

మామగారు, అత్తగారు, ఇద్దరు బిడ్డలూ, ఒక ఆంగ్లో ఇండియన్ ఆయా, ఒక నౌకరూ వొకరోజు మా యింటికి వచ్చారు. అత్తగారు వెలగల చీరలు - పట్టువి, సరిగవి, వివిధ

రంగులవి-రోజుకు మూడు నాలుగుసార్లు మారుస్తుంది. నగలు కూడా మార్చేది. ఏమిభోగం! ఏమి ఐశ్వర్యం! నౌకరుని పిలిచి, "వొరేయ్! వీరి తలగడలు గట్టిగా ఉన్నాయి, తీసేసి, మన దిండ్లు వెయ్" అన్నది. భోజనాలవద్ద "మా బిడ్డలకు, మజ్జిగ అలవాటులేదు. పెరుగు లేకపోతే వేడిచేస్తుంది" అని ఎత్తిపొడిచింది.

మామగారు రాత్రి ఎక్కడెక్కడో తిరిగి, పన్నెండు గంటల తరువాత తూలుతూ వచ్చారు. అత్తగారూ మామ గారూ దెబ్బలాడారు. మామ ఉదయాన తొమ్మిదిగంటలకు లేచి, కాఫీత్రాగి, మా నాన్నవద్దకు వచ్చారు.

"వొరే! ప్రభాకర్! గాంధి ఉద్యమంలోచేరి, వకీలు ప్రాక్టీసు మానేశావు! ఏం తెలివితేటలు! జైళ్ళకు వెళ్ళగానే స్వరాజ్యం వస్తుందా? ఎంత మూర్ఖులు" అని నవ్వాడు, బారిష్టరుమామ. "త్యాగంలేకుండా, కష్టాలుపడకుండా, ఏ గొప్పకార్యంగాని నెరవేర్చలేము" అన్నాడు నాన్న.

"ఇంగ్లీషు వాళ్ళకు అర్థమయ్యేది వొకే విషయం హింస, దౌర్జన్యం, కాల్చివెయ్యడం. దేశభక్తులు, ఏ వంద మందో చావడానికి సిద్ధపడి, ప్లానువేసుకొని, రివాల్వర్లతో, ఒకేరోజు, వొకేటయిములో, నూరుమంది కలెక్టర్లను కాల్చేస్తే బ్రిటీష్ గవర్నమెంటు కూలిపోతుంది. అహింసలు: సత్యాగ్రహాలట! గాడిదగుడ్డులు:" అన్నాడు బారిష్టరు గారు మానాన్న నవ్వి "ఎంత Childish గా మాట్లాడావు! సరే! ఆ నూరుమందిలో నీవుచేర్తావా?"

"ఉద్యోగాల్లో వున్నవాళ్ళము చేరలేకపోతే డబ్బు యిస్తాము. రివాల్వర్లు కొనడానికి డబ్బు కావాలికదా!"

నాకు మామమీద ఉండిన గౌరవమంతా ఈ వాక్య సంఘటనతో మాయ మయింది. వట్టి మాటలకోరు, అనుకొన్నాను. అయితే మానాన్న అంతటితో మానివెయ్యలేదు.

"బారిష్టరూ! నీ భార్యకు నీ శిక్షణ పూర్తి అయిందా!"

"స్త్రీల క్లబ్బుకు డబ్బు యిచ్చి ప్రెసిడెంటు అయింది" అన్నాడు చలోక్తిగా. మామ నాన్న కలిసి నవ్వారు.

"కాబట్టి, నీ ఆశయాలు అన్నీ నెరవేరాయా, లేక, ఇంకా ఏమయినా వున్నాయా?

మామకు సిగ్గు వేస్తుందనుకొన్నా, కాని.........

# 3

తరువాత అయిదు సంవత్సరాలు గడిచాయి. మా నాన్న జీవితం ఎక్కువగా జైళ్ళలోనే గడిచింది. నగలు భూములు పూర్తిగా అమ్మివేసి దేశవిముక్తికి ఖర్చుపెట్టాడు. చివరకు భోజనానికిలేక, ఇల్లు తాకట్టు పెట్టారు. స్వరాజ్యం వచ్చాక విడుదల అయ్యారు.

మా బారిష్టరు మామ తిరిగి వచ్చాడు. ఆంగ్లోఇండియన్ ఆయా కూడా తనవెంట వచ్చింది. యూరపియన్ హోటల్లో దిగారు. ఒకసాయంత్రం మానాన్నను చూడటానికి వచ్చారు.

"ప్రభాకర్! స్వరాజ్యం తెచ్చారూ! ఎంత అమాయకులు! ఇంగ్లీషువాళ్ళు అంత సులభంగా వెళ్ళతారా?" అని నవ్వాడు. మా నాన్న సమాధానం చెప్పలేదు.

"నీవు ఎంతో త్యాగంచేశావు. ఏదో గొప్పఉద్యోగం సంపాదించుకో" అని సలహా యిచ్చాడు, మామ.

"ఇది లాభంకొరకు చేసిన వ్యాపారం కాదోయ్! నా ఆత్మ సంతృప్తి కొరకు దేశసేవ చేశాను. ఆ సేవలో లభించిన సౌఖ్యం నాకుచాలు" అన్నారు. బారిష్టరు పడిపడి నవ్వాడు, వెర్రి వెయ్యివిధాలు. ఇదీ వొకరకం అన్నాడు మామ.

కొంతసేపుండి "రాముకైనా ఏదో మంచి ఉద్యోగం ఇప్పించు" అన్నాడు.

"వాడికేం! నిక్షేపంలాగు B. A. L. T టీచరు. నన్నడిగితే, మానవసేవ చేసుకోమని చెబుతాను.

---

# ఎంత మారిపోయ్యావు?

చైనాబజారులో ఎదురుపడింది శ్యామల. ఆమెను కలుసుకొని అయిదారు సంవత్సరాలయి ఉంటుంది. ఆమెను చూడగానే, ఎన్నెన్నో విషయాలు జ్ఞాపకంవచ్చాయి. ఎంతో సంతోషంతో.

'హాలో! శ్యామల! బహుకాలదర్శనం' అని నమస్కారం చేస్తిని.

'నమస్కారం! రామారావుగారూ! మీరు నన్ను పూర్తిగా మరచిపోయారనుకొంటిని' అని నన్ను కలుసుకొన్నందుకు ఎంతో సంతోషించింది.

'మరచిపోవడమే! అలా అనుకోకు!'

'ఎన్నోసార్లు మద్రాసుకు వచ్చారని, మన స్నేహితులు చెప్పారు. నన్ను కలుసుకోకుండానే వెళ్ళారుకదూ!'

'వాస్తవమే! తప్పుచేశాను: క్షమించవూ? ఈ మోడరన్ హోటల్లోనే వున్నాను, కాఫీతాగి వెళ్ళవచ్చు, రా.' అని ఆహ్వానించాను.

కాఫీ త్రాగుతూ, కులాసాగా కబుర్లు చెప్పుకొంటూ వుండగా, హఠాత్తుగా ఆమె కళకళలాడే ముఖం ముడుచుకపోయింది. కాని నేను ఆశ్చర్యపడలేదు. ఆమె జీవితం అలాంటిది.

'మీ కూతురు ఏలాగుందండి ?' అన్నది. ఎన్నో విష యాలుండగా ఈ చిల్లర విషయం ఎందుకు తెచ్చిందో నాకు తోచలేదు.

'బాగుంది. S. S. L. C పరీక్షకు వెళ్ళుతుంది.'

'పెండ్లి అయిందా?' నాకు నవ్వూ, ఆశ్చర్యం వేసింది.

'అంత చిన్నపిల్లకు, అప్పుడే పెళ్ళా?' అంటిని. అలాంటిప్రశ్న వేస్తుందని నే ననుకొనలేదు. ఒకప్పుడు అభ్యు దయవాది. అలాంటిప్రశ్న అడగటానికి కారణమేదో వుండాలి. కాని, కారణం తోచలేదు. ఎంత దిగజారిపోయింది. అనుకొంటిని.

'చిన్నప్పుడే వివాహం చేయించటం మంచిదండి' అని దుఃఖంతో నా వైపు చూచింది. నాకు జాలివేసింది. ఇప్పుడు నాకు కారణంకూడా తెలిసింది. స్వానుభవాన్ని ఆమె అపార్థం చేసుకొంటూ వున్నదని అనుకొంటిని.

'ఎంత మారిపొయ్యావు?' అంటిని!

'తల్లిదండ్రుల సలహాను, తీర్మానాన్ని సమ్మతించే వయసులోనే వివాహం చేయించటం మంచిది'అని ఖచ్చి తంగా తన అభిప్రాయాన్ని చెప్పింది. వాదించినా, ఉపయోగ ముండదని నాకు తెలుసు, ఆమె కొంతసేపు ఆగి.

యువతులగ ఎన్నెన్ని పరీక్షలలో ఉత్తీర్ణులమైనప్పటికీ మా అంతట మేము నిశ్చయించుకోలేని సమస్య లెన్నో ఉన్నాయి. వాటిలో ముఖ్యమైంది వివాహము. తల్లిదండ్రులు నిశ్చయించడం మంచిది'అని అన్నది శ్యామల. ఎంత సంకు

చిత అభిప్రాయమో ఆమె యోచించడం లేదా? తన జీవితంలో అంత నిరాశ ఏర్పడినదా? అని అనుకొంటిని.

శ్యామల M. A. L. T. 35 సం॥ల వయసు, ట్యూటోరియల్ కాలేజిలో ప్రొఫెసరు. నెలకు 250 జీతం. 1933 లో ఆమెతో నాకు పరిచయం ప్రారంభం. స్వాతంత్ర్యోద్యమం తీవ్రంగా జరుగుచుండినకాలం. విద్యార్థి ప్రపంచంలో గొప్ప పాత్ర వహించింది. తనకాలేజీలో అతివాదులైన దేశభక్తుల బృందంలో చేరి, బ్రిటిష్ ప్రభుత్వాన్ని ధిక్కరించింది. హర్తాళ్ళలో వూరేగింపులో పాల్గొన్నది. తమ కాలేజి విద్యార్థి నాయకుడు గోపాలరావులతో స్నేహమయింది. రావు నిష్కల్మషమైన దేశభక్తుడు. విదేశీవస్త్ర బహిష్కారోద్యమంలో, పోలీసులు అతనిని మౌంటురోడ్డులో కొట్టిన దెబ్బలు తలుచుకొంటే, ఇప్పుడుకూడా ఒళ్ళు ఒణుకుతుంది. జైళ్ళకుకూడా అలవాటు పడిపోయాడు, కాలేజీనుండి అతన్ని తరిమివేసింది తెల్లదొరతనం. అతనిత్యాగం, ధైర్యసాహసాలు శ్యామలను ఆకర్షించాయి. వీరిద్దరూ వివాహంచేసుకోవాలని తీర్మానించుకొన్నారు. కాని ఆర్థిక కష్టాలవల్ల, వివాహం ఆలశ్యమగుతూ వచ్చింది.

శ్యామల తల్లిదండ్రులు చిన్నప్పుడే చనిపోయిరి. అన్నగారు రంగూనులో వడ్డీవ్యాపారంచేసి బాగా గడించుచుండిరి. చెల్లెలికి నెలకు రు 100 వంతున పంపుచుండిరి. అన్నను తండ్రిలాగు ప్రేమించింది శ్యామల. ఆయనకూడా శ్యామలను తన బిడ్డలాగే ప్రేమించాడు. అన్న తనకొరకు ఎంతైనా త్యాగం చేస్తాడని అమాయకురాలు నమ్మింది. తన వివాహేచ్ఛను

అన్నకు తెలుపలేదు. సమయం వచ్చినప్పుడు తెలుపవచ్చు ననుకొన్నది.

శ్యామల గోపాలరావుల మధ్య అభివృద్ధి చెందు చుండిన పరస్పర ప్రేమ నాలాంటి అభ్యుదయవాదులకు చాల నచ్చింది. మేము ఆకాలంలో ఇంగ్లీషు నవలలు చదువుతూ, ప్రేమవివాహములను గురించి కలలుకంటూ వుండిన రీతిగా, వీరిద్దరూ విద్యావంతులు, యువకులు, దేశభక్తులు, ప్రేమిం చుకొంటూ వుండిరి, ఏలాంటి పొరపాటు చెయ్యడంలేదు. ఏలాంటి అపనిందలకు తావివ్వడంలేదు. అంత గౌరవంగా ప్రవర్తిస్తూ వుండిరి. ఇద్దరూ కలసి మీటింగులకు, సినిమాలకు, షికార్లకు వెళ్ళడం వారికి మామూలైంది. ఈజుజోడుగా ముచ్చటగా, పవిత్రప్రేమ వాతావరణాన్ని తమతో తెచ్చు చుండిరి. వారి భావిజీవితంకూడా యువతీ యువకులకు ఆద ర్శంగా వుంటుందని ఆశించాము! పాతపద్ధతులు పోయి, నవీన సాంప్రదాయాలు అలవాటులోకి వస్తూవున్నందుకు సంత సించాము.

ఆవిడవిద్య పూర్తిఅయింది; కాని గోపాలరావు విద్య పూర్తి అగుటకు సాధ్యం లేదు. నిరంకుశ బ్రిటిష్ ప్రభుత్వం అడ్డుపెట్టింది. ఆయన బీదవాడు! ఉద్యోగంలో చేరి తల్లిదండ్రు లను పోషించాలి. ఏ వుద్యోగంలో చేరినా, పోలీసులు వెన్నంటి, యజమానులను బెదరించి, ఆ వుద్యోగాన్ని ఊడ కొట్టేవారు. ఆమె టీచరుగా చేరి గోపాలరావును ఆయన కుటుంబాన్ని పోషించాలని సంకల్పించుకొన్నది. వారిద్దరి

ప్రేమ అలాగు దినదినాభివృద్ధి చెందటం చూస్తూవుండిన నాలాంటి స్నేహితులకు ఎంతో ఆనందదాయకంగా వుండింది.

విద్య పూర్తిఅయిన కారణం వలన, శ్యామలను వివాహం చేసుకోవలసిందని, అన్నగారు మరొకవైపునుండి ఒత్తిడి తెచ్చారు అప్పటికే 25 సం॥ల వయస్సు శ్యామలకు; ఇక ఆలస్యం చెయ్యకూడదు. న్యూసుపేపర్లలో వరునికొరకు అడ్వర్టయిజు చేశాడు. నెలకు రు 350-0-0 పైగా జీతం సంపాదించేవారిని మాత్రమే సెలక్టు చేస్తూవుండిరి అవసరము యితే, కట్నం చెల్లించుటకు సిద్ధంగా వుండిరి, ఇక ఆవిడ తన ప్రేమరహస్యాన్ని దాచివుంచడం సాధ్యంకాదు. అన్న గారికి వ్రాసింది బీదవానిని వివాహం చేసుకొనుట వలన శ్యామల జీవితం దుఃఖమయమగుననియు తమ హోదాకు తగిన ఆఫీసరును వివాహం చేసుకొనుట ఉచితమనియు ఖచ్చితంగా వ్రాశాడు.

అన్న తనను ఎంతో ప్రేమతో పెంచాడు. ఆయన మనసును కష్టపెట్టడం ఎంతమాత్రమూ ఇష్టపడలేదు. తనమీద ఉన్న ప్రేమవల్ల, తాను యిష్టపడిన వానిని పెండ్లాడుటకు అన్న సమ్మతించుననే ఆశ, నశించిపోతూ వుండింది. శ్యామలకు ప్రేమవివాహంమీద ఎంతఆశ వుందో తన అన్నకు ద్రవ్యవంతునితోగాని, గొప్ప గజిటెడ్ ఆఫీసరుతోగాని సంబంధం మీద అంత ఆశవుండింది. శ్యామల ఏదో ఒక ఆదర్శం మానుకోవలసి వచ్చింది. కాని నిశ్చయం చేసుకోలేకపోయింది.

గోపాలరావును వివాహం చేసుకొనే ప్రయత్నం పూర్తిగా మానివెయ్యని యెడల ఖర్చులకు డబ్బుపంపడం లేదని బెదరించుటేగాక, రంగూనుకు వెంటనే రమ్మని ఆదేశించాడు అన్న.

రంగూనుకు వెళ్ళేటప్పుడు, సాగనంపడానికి గోపాలరావు శ్యామలతో స్టీమరుకు వెళ్లాడు. ఇద్దరూ చాల దుఃఖించారు. "అన్నయ్యకు దుఃఖంకలిగించటం నాకు యిష్టంలేదు కాని, నిన్నుతప్ప మరెవరిని వివాహం చేసుకోను" అని నిష్కర్షగా చెప్పింది. ఇది పరిష్కార మార్గంకాదని గోపాలరావు గ్రహించాడు. దానిలోవుండే వైరుధ్యం కనుబరచాడు, అన్నను ఒప్పించుటకు ప్రయత్నించు తానంటుందేకాని, అన్న సమ్మతించనియెడల ఆయనను ధిక్కరించి గోపాలరావును వివాహం చేసుకుంటానని చెప్పలేదు. దానితో ఆమె మీాద గోపాలరావుకు ఆశ నశించింది.

తన జీవితం చాల భారంగావుంది. గోపాలరావుకు తాను నిర్మించుకొన్న ప్రేమసౌధం కూలిపోయింది. పిచ్చివాడవునని కొందరు స్నేహితులు; ఆత్మహత్య చేసుకుంటాడని మరికొందరు, భయపడుచుండిరి. ఈలాంటి సందిగ్ధ స్థితిలో గోపాలరావుకు టైఫాయిడ్ జ్వరం వచ్చింది. జ్వరంలోకూడా శ్యామలను గురించి తలంచుకొంటూ-ఆమెలేనిది జీవించలేనని కలవరించుతూ వుండేవాడు ఈ విషయాన్ని స్నేహితులు ఆమెకు వ్రాసిరి. అన్నను ధిక్కరించి రాలేకపోయింది. అంతేకాదు అన్న ఏర్పరచిన వరుళ్ళను సమ్మతించలేకపోయింది.

గోపాలరావుకు నెమ్మదించింది. బొంబాయికివెళ్ళి స్వతంత్ర పత్రికలో చేరాడు. శ్యామల శక్తిహీనతను గ్రహించాడు; ఆమెమీద ఆశ వదలివేశాడు. అయిదు సంవత్సరాలు గడిచాయి. తన దుఃఖం మరచిపోవుటకు వివాహం చేసుకొన్నాడు. బిడ్డలు కలిగారు. అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు!

శ్యామల మద్రాసులో టీచరుగా చేరింది. తన ప్రేమను మరొకరికి యివ్వజాలకపోయింది. గోపాలరావే తన మనసుకు వస్తూవుండిరి. తన దుఃఖాన్ని మరచిపోవుటకు మతగ్రంథాలుచదువుతూ దేవుళ్ళను పూజించుచూవుండింది. కాని తన మనోదౌర్బల్యాన్ని, తనబాధ్యతను, గ్రహించుకోలేదు.

"శ్యామలా! నీకెందరో స్నేహితులున్నారు. వివాహం చేసుకో" అంటిని.

కొంతసేపు ఊరకవుండి..."ఎందరో వున్నారు... వాస్తవమే... నన్ను ఎంతో గౌరవిస్తారు... నన్ను సోదరిలాగు ప్రేమిస్తారు... వారి వివాహాల విషయాల్లో నాసలహా అడుగుతారు... కాని... "మంచి 'నిని స్వయంగా వరించి, వివాహంచేసుకో, చెల్లీ" అని ఎంతో ప్రేమతో చెప్పాను.

కొంతసేపు అయినతరువాత కన్నీరు తుడుచుకొని, "నాకర్మ"అని లేచింది. నాదుఃఖాన్ని అణచుకొంటిని. "కర్మను, దేవుళ్ళను నిందించుటవల్ల సమస్య పరిష్కారం

కాజాలదు. మనసుతృప్తిపడదమ్మా! శ్యామలా, ధైర్యం తెచ్చుకో."

ఆమె వెకిలినవ్వు నవ్వింది, బస్సువరకూ ఆమెవెంట వెళ్ళితిని.

"కూతురికి చిన్నవయసులోనే వివాహం చేయించండి" అని బస్సు ఎక్కుతూ సలహా యిచ్చింది.

ఆ బస్సువైపుచూస్తూ నిలబడిపోతిని.



# పిచ్చికి కారణం

మొన్ననే పిచ్చి ఆస్పత్రిని చూశాను. అదే మొదటి సారి చూడడం. డాక్టరు నారాయణరావుగారు మా క్లబ్బులో పిచ్చివాళ్ళ కథలు చెప్పి నవ్విస్తుంటారు. ఎన్ని చెప్పినా, ఇంకా చెప్పమని బ్రతిమలాడేవాళ్ళు. ఆయనకు విసుగెత్తినప్పుడు ఒకమాటు నీవేవచ్చి చూడరాదా అనేవారు. నాకు ఇప్పుడు తీరికరోజులే; వెళ్ళాను. డాక్టరు ఆఫీసుగదిలో లేరు. రోగులను చూడటానికి వెళ్ళారు, గదిముందు వసారాలో కొందరు కూర్చొని వుండిరి. నేను వసారాలో అటూ ఇటూ పచారుచేస్తూ వాళ్ళముఖాల్ని చూడసాగాను. రంగారావు గారు కనబడ్డారు. ఆయన నాకు చిరపరిచితులే.

"హలో! రంగారావుగారూ! భలే సరియైన చోటికే వచ్చారు" అన్నాను.

ఆయన నవ్వి "నా కొరకుకాదు అంటూ భార్యవైపు కంటితో చూపాడు. నాకు ఆశ్చర్యం వేసింది. అసలు పిచ్చి వాడు అతను! అయితే భార్యను పిచ్చి ఆస్పత్రిలో చేర్చడ మేమిటి! నాకేమీ తోచలేదు.

న్యూసు పేపర్లు చదివేవారికి ఆయన్ను గురించి తెలిసే వుంటుంది. ఆవూరి కొకప్పుడు ఒక బైరాగి వచ్చాడు.

వెండిని రాగిని బంగారం చెయగలడని పుకారుపుట్టింది. రహస్యంగా బైరాగిని తన భవనానికి పిలపించుకొన్నాడట. 72 ఘంటలలో, మంత్ర తంత్రాలతో బంగారం అవుతుందని నమ్మించాడు, బైరాగి. వెండి, రాగిసామానులు తెచ్చిపెట్టారు, రంగారావు దంపతులు ఆమూడురోజులూ అక్కడే కూర్చొండి పూజలు చెయ్యమని ఒప్పించాడు. రంగారావు దంపతులకు పట్టరాని సంతోషం అయింది ఆమె ఒంటినిండా నగలు దరించింది. రెండవరాత్రికే అలిసిపోయారు దంపతులు. గాఢమైన నిద్ర పట్టింది. బైరాగివారిద్దరికి క్లోరోఫాంరయిచ్చి, రవలూ, బంగారు నగలూ మాత్రమే తీసుకెళ్ళాడు. యాభై వేలు నష్టం. కొందరు పరీకు అయ్యేవుంటారు, ముఖ్యంగా అనంతవరం గ్రామపోలీసులు, లేకపోతే ఆ బైరాగి దొంగ ఎందుకు దొరకలేదు? అని అందరూ అనుకున్నారు.

రంగారావుగారు ఆస్థిపరులు, వీరితాత ఆ గ్రామానికి వచ్చినప్పుడు పైబట్టలతో మాత్రమే వచ్చాడు. చిల్లరఅంగడి పెట్టుకొని బ్రతికాడు.

క్రమేణ ధాన్యంకొని అమ్మటంలో బాగాగడించాడు. చనిపొయ్యేకాలానికి ఒక పెంకుటిల్లు, మూడు ఎకరాల మాగాణీ, అయిదువేల రూపాయల బంగారం, యిరవయివేల రూపాయలు ఇతర ఆస్తి ఉండింది. రంగారావుతండ్రి ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో ఆస్తిని మూడులక్షలకు పెంచాడు. 1937లో చనిపోయాడు. రెండవ ప్రపంచయుద్ధ కాలంలో, రంగారావుగారి అదృష్టం ఉచ్చదశలోవుండింది. 1? లక్షలకు పెరిగింది. అయిదువందల ఎకరాల మాగాణి, విరివిగా వడ్డీ

వ్యాపారం. అనంతవరం గ్రామం చుట్టుపట్ల, తనతో సమాన మైన లక్ష్మీసంపన్నులు మరొకరులేరు కాని పాపం! బిడ్డలు లేరు, అయితే తనపేరాసకు అంతంకూడా లేదు; వార్తాపత్రి కల్లో ఈ విషయాన్ని చదివినవారందరమూ "రంగారావుకు సరియైన చోటు పిచ్చి ఆస్పత్రేను" అని అనుకొనేవాళ్ళం. మనమెవరమైనా ప్రభుత్వాధికారంలో వుండివుంటే, ఈ రంగా రావుగారిని ఆ బైరాగిని. పిచ్చి ఆస్పత్రిలో భద్రంగా పెట్టి వుందుము.

ఈ పెద్దమనిషిని గురించి మరొకవార్త కూడా పేప ర్లలో వచ్చివుండింది. రాత్రి సమయంలో కొందరు తన యింటిలో దోపిడిచేసి, తమను స్తంభాలకు కట్టి అప్పుపత్రాలు లెక్కల పుస్తకాలు డాక్యుమెంట్లు తగలబెట్టి నోట్లూ నగలూ దొంగిలించి వెళ్ళారనీ, గ్రామంలోనివారు భయపడి తమ యిండ్లలోనే ఉండిపోయిరని, పోలీసులు వచ్చేలోగానే దొంగలు పారిపోయారనీ, నేను చదివినప్పుడు, ఈలాంటి ఘోరమైన కష్టాలు నాకే వచ్చివుంటే, నాకు పిచ్చియెత్త యినా ఉండేది. లేదా నేను ఆత్మహత్యైనా చేసికొని వుందును అని అనుకొంటిని.

రంగారావుగారు పిచ్చి ఆస్పత్రిలో చేరటానికి వస్తే, ఆశ్చర్యపడేవాణ్ని కాదు. నా తెలివితేటలకు నన్ను నేను అభినందించుకొనేవాణ్ని. కాని, ఆయన భార్య పిచ్చిది కావ డంలో కారణం నాకు తోచలేదు!

డాక్టరు ఇంకనూ రాలేదు. కాలం గడపడానికి ఏదో బాతాఖాని చెయ్యాలి.

"ఏమండి కారణం?" అని అడిగాను.

"డాక్టరుగారు ఆలోచిస్తూ వున్నారండి."

"ఆడవాళ్ళకు బిడ్డలులేక, చేతినిండా పని ఉండకపోతే సాధారణంగా ఈ వ్యాధి వస్తుందట" అన్నాను.

"అవునండి, బిడ్డలు కలుగలేదు. ఇంటిలో పనిపాటలు చేసుకోనవసరం లేదండి"

"మీరెంతో ఐశ్వర్యవంతులు. స్కూలో, ఆస్పత్రో, అనాదశరణాలయమో స్థాపించి ఆమెకు పని కల్పించలేక పోతిరా ?"

"ఈ కాలంలో మాకు చాల కష్టాలు, నష్టాలు ఉన్నాయండి. పట్నవాసాల్లో వుండే మీలాంటి వారికి, మా పల్లెటూళ్ళలో రయితులవల్ల, కూలీలవల్లనేను పడేబాధలు మీకు తెలియవండి. స్కూళ్లు, ఆస్పత్రులు స్థాపించే కాలం పోయిందండి"

"ఒకప్పుడు దోపిడి జరిగింది మీ యింటిలోనే కదండి. మీ గ్రామంలో ప్రజలు మీ సహాయానికి రాలేరా ?"

"ఈ కాలంలో ప్రజల్లో కృతజ్ఞత ఉండడంలేదండి వారికి అవసరం వచ్చినప్పుడు 'బాబూ! నాయనా! మీరు అప్పయిచ్చి, రక్షించకపోతే, మాగతేంకావాలి? అని యిచ్చేవరకూ వదలిపెట్టరు. వారిపని పూర్తికాగానే మనలను మరచిపోతారు ఈ బాధలు పడలేకనే మద్రాసులో ఉంటూ వున్నాను."

మగవాళ్ళకు ఉంటూన్న కష్టాల్లో సహస్రాంశమైనా స్త్రీలకు ఉండవు. ఈలాంటి వ్యాధి, మనకురాదు: స్త్రీలకు

ఎందుకు రావాలి? కారణం ఏ ముంటుంది? అని కాలం గడవడానికి అడ్డుదిడ్డ ప్రశ్న వేశాను.

"స్త్రీల మనస్సు చాల బలహీనమండి" అన్నాడు. ఆమె తల వొంచుకొని, కన్నీరు పెట్టుకొన్నది. నాకు చాల జాలి వేసింది. అయితే, స్త్రీల మనస్సులు పురుషుల మనస్సు కంటే బలహీనమా, అనే సంశయం నన్ను బాధించసాగింది.

ఇంతలో డాక్టరుగారు వచ్చారు. పై సంభాషణలు నా సంశయాన్ని గురించి ప్రస్తావించితిని. ఆయన పడిపడి నవ్వాడు. నా కేమీ అర్థంకాలేదు.

"ఆయనకు ఒక ఉంపుడుగత్తెవుంటె భార్య దెబ్బలాడుతున్నది. అసలు ఆమె పిచ్చికి ఇతనే కారణం. ఆయనకు ఎంతో చెప్పిచూశాను. ఆయన ఉంపుడుగత్తెను వదలిపెట్ట లేదు" అన్నాడు, ఇంకనూ నాకు సంశయం పూర్తిగా పోలేదు.

"ఆమెకు దుర్గుణాలు లేవనుకోండి" బహిరంగంగా ఆమె ఒకరిని పెట్టుకొనివుంటే, ఆయనకు పిచ్చివచ్చివుండునా? అని ప్రశ్నించితిని.

ఒకటి రెండు నిముషాలు ఆలోచించి "తన మర్యాద కొరకు ఆమెను చంపించి వుండును" అన్నాడు డాక్టరు.



# పట్టుదల

"అబ్బ; వచ్చావా, నాయనా!" అంటూ తల్లి పక్క మీదినుండి లేవబోయింది. కాని దేహాద్యంతం వణకసాగింది. పురుషోత్తముడు, తల్లిని మెల్లగ పడుకోబెట్టి ప్రక్కనే కూచున్నాడు. కుమారుని చేతులు నిమురుతూ.

'ఎప్పుడు వదిలారురా, జెయిలునుంచి?' అన్నది.

'మొన్ననే.'

'అంగట్లో అన్నీ ఉన్నాయి. అల్లుడి నోట్లో శని ఉందన్నట్టు, నీకర్మమేమి కాలిపోయిందిరా? నిక్షేపంగా ఇంట్లో వుండక ఈపాడు కాంగ్రెసు ఎక్కడ దాపురించిందిరా?

"అదీచాలదని' ఈపాడు పెళ్ళిపెటాకులు కూడానూ... ఇకనైనా ఈలాంటి పనులు మానేసి వచ్చేయ్. దాన్ని వదిలేసిరా! "తల్లికి అడ్డుతగిలి" అమ్మా! ఇక మాట్లాడకు! ఓర్చుకోలేను. చావునడకలో ఉన్నావని వచ్చాను. కాని,... నీ మొగం చూడకూడదనుకొన్నా. నా భార్యను పెట్టిన బాధలూ, ఆవిడనూ నన్నూ విడదీయటానికి చేసిన కుట్రలూ, మోసాలూ అన్నీ నాకు తెలుసు" అంటూ లేచాడు.

పుట్టక పుట్టక ఒకేకొడుకు పుట్టాడు. ఎన్నో వ్రతాలు చేసింది. ఎందరో దేవుళ్ళకు మొక్కింది. పురుషోత్తం పుట్టుకతో తల్లి ఆరోగ్యం చెడిపోయింది. ఎప్పుడు చచ్చిపోతుందో

నని అందరికీ సంశయమే. కాని, అలాగే జీవించే వున్నది, 25 సంవత్సరాలుగ. కౌమారుడు సుఖపడాలనే ఆశ ఒక్కటే తన జీవితంలో.

తల్లి కుమారుని లాగి కూర్చోబెట్టుకొన్నది. "నీతండ్రి ఇన్నిలక్షలు గడించింది నీకొరకుకాదా? నీమేలు కోరికదా అలా సలహాయిచ్చాడు?" అన్నది తల్లి.

'చాలు! చాలు! నాతండ్రికి నామీద ఉండే ప్రేమ! దేశద్రోహి! తెల్లదొరల గులాం: 1941 లో, నేను జెయిలు నుంచి విడుదలై వచ్చినప్పుడు, ఇంటిలో కాలు పెట్టవద్దని తరిమివేశాడుగదూ! మరచిపోలేదు. ఆయన పాపిష్టిఆస్తి నాకు అవసరం లేదు' అన్నాడు కౌమారుడు.

'ఇప్పుడాలాంటికోపాలు లేవుగాని...'

'అవును మరి. ఇక నేను జెయిలుకు పోనవసరంలేదు. స్వరాజ్యం వచ్చిందిగా... అయితే మరోవిషయం వుంది. నేనిష్టపడిన భార్యను వదలివేయాలి; తను ఇష్టపడ్డదాన్ని, స్వకులంలోనే నేనుతిరిగీ వివాహం చేసుకోవాలి. అంతేనా... కారణం? మీవద్ద పాపిష్టిఆస్తి ఎంతోవుంది!"

'నిజమేరా, నీవన్నది. నీవు పసివాడవు. నీకేం తెలుసు ననీ. స్వకులం విడిచి వేరేకులంలో చేసుకోరాదురా, అప్రతిష్ఠ. నామాట విను. నీ తల్లిని, నాజీవితంలో కోరేదంతా, నీ శ్రేయస్సుకదూ! ఆవిడకెంత డబ్బయినా ఇచ్చి...

'అమ్మా' అంటూ లేచాడు. దేహం, ఆద్యంతం వణకసాగింది. కళ్ళు ఎర్రబడ్డయి.

'ఛీ! నీ మొగంచూడలేను. నీహృదయం... ఇక మాట్లాడలేకపోయాడు. తల్లి మెల్లగ లేచి, కొడుకును కూర్చోబెట్టుకొని ఏడ్వసాగింది.

1935 లో రాయపురం హైస్కూలులో చదివేప్పటి నుండి తల్లిదండ్రులకూ కొమారునికి పడడంలేదు. తండ్రి వొక డాక్టరు; జస్టీసుపార్టీ నాయకుడు. చాలా తక్కువ కులంలో పుట్టాడు. పై కులాలవారి అన్యాయాలకు గురి అయ్యాడు. అందువల్ల వారిమీద బద్ధద్వేషం. తన కులం అంటే అమిత అభిమానం. అందుకు తోడు, తెల్లదొరలవలన కొంతడబ్బు, హోదా గడించుకొన్నాడు; ఫలితం దేశద్రోహి అయ్యాడు. కొమారుణ్ణేమో గాంధిగారి దేశభక్తి. త్యాగం, ధైర్యసాహసాలు, మానవసేవ ఆకర్షించాయి; జాతీయోద్యమమే తన పరమాశయం. టీచర్లను ధిక్కరిస్తూ, విద్యార్థులను కూడగట్టుకొనేవాడు. హర్తాళ్ళు. ఊరేగింపులు, సభలు మొదలగు కార్యాలను అత్యంత సాహసం వీరావేశంతో సాగించేవాడు. పోలీసు లాఠీదెబ్బలకు, జైళ్ళకు అలవాటయ్యాడు. కాలేజీలో చదివేకాలంలో ప్రపంచయుద్ధం ప్రారంభించింది. సుభాస్‌బోసు ఆదర్శాలు దౌర్జన్యవాదం, పురుషోత్తానికి నచ్చిపోయాయి. పోలీసులమీద, తన సహచరులచేత రాళ్ళు రువ్వడంతో ప్రారంభించాడు తన కార్యకలాపాన్ని. ఆగస్టు తిరుగుబాటు కాలంలో టెలిగ్రాం తీగెలు నరికించడం, రైలుపట్టాలు తొలగించటం, పోలీసు స్టేషన్లు తగలబెట్టించడం, తనకు ముఖ్యకార్యక్రమం అయింది.

కాలేజీలో తనతోకలిసి పనిచేస్తూండిన విద్యార్థినులందరిలోకి అమృత ప్రాణస్నేహితురాలైంది; చివరకు వీరిద్దరు వివాహంచేసుకొని తమ జీవితం దేశాభ్యుదయం కొరకు, దిక్కులేని బీదసాదల శ్రేయస్సుకొరకు వినియోగించాలని తీర్మానించుకొన్నారు. స్వకులంలో వివాహం చేసుకోలేదని, తాము ద్వేషించే వైశ్యకులం బాలికను పెండ్లిచేసుకోవడంతో, (పురుషోత్తం) మీద తల్లిదండ్రుల కోపోద్రేకం అధికమై పోయింది. ఏలాగో మాయోపాయం చేసి వారిద్దరిని విడదీయాలని, తల్లి ఎన్నో పన్నుగడలను పన్నుతూనే వుంది. అసలే అనారోగ్యం. దానితోపాటు ఈ మనోవ్యాకులం కూడాను. నానాటికి క్షీణించుతూ మంచం పట్టింది. అయితే నేమి! కుట్రలు, కుతంత్రాలకు మాత్రం కొదువలేదు. కావలసినంత అవకాశమూ లభించినది మరి.

1943 మొదలు 1945 సం॥ వరకూ పురుషోత్తం జైలులో నున్నప్పుడు, తోటి దేశభక్తులతో, కాలం సౌఖ్యంగానే గడుపుతూ వుండేవాడు. తనకు కావలసిన పుస్తకాలను, తన ప్రేయసి అమృత తెచ్చి యిచ్చేది. కాంగ్రెసు నాయకులతో రాజకీయంగా అనేకచర్చలు సాగించేవాడు. స్వరాజ్యం లభించాక కూడ తామంతా దేశానికి చేయవలసిన కార్యాలున్నాయి. దేశాన్ని ఏలాగు అభివృద్ధికి తేవాలి? శ్రామికులను, బీదరైతు కూలీలను, విద్యార్థులను, ఏవిధంగా అభివృద్ధికి తీసుకరావాలి మొదలగు అనేక విషయాలను యువకదేశభక్తులతో ఆలోచించుతూ వుండేవాడు.

కాని తల్లిమాత్రం అతన్ని సుఖంగా ఉండనివ్వలేదు. ఉత్తరాలు తరుచుగా వస్తూవుండేవి. ఆమెకు పుత్రునిమీద ఎంతో ప్రేమ. "తండ్రి నిన్ను తలచుకొని దుఃఖిస్తున్నాడు. బోలెడంత ఆస్థిని కాలితో తన్ని వెయ్యవద్దు. ఆయన చెప్పి నట్లు విను. స్వకులంలో తిరిగీ వివాహం చేసుకో. మేమెంతో కాలం జీవించము. అటుతరువాత నీ యిష్టానికి అడ్డురాలేము కదా!" అని ఎంతో ప్రేమతో వ్రాసింది.

"ఛీ! ఇక ఈలాంటి ఉత్తరాలను చదువకూడదు. కులాభిమానమనే పెనుభూతం, మనదేశాన్ని, మన మానవ త్వాన్ని నాశనంచేస్తూ వున్నది. బ్రిటిష్ ప్రభువులను తరిమి వేసినంత మాత్రాన మనదేశం బాగుపడదు; కులాభిమా నాన్ని నాశనం చెయ్యాలి! మనసంఘంలో ఎంత కుళ్ళు ఉన్నది!" అని దుఃఖించి తల్లికి ఉత్తరాలను వ్రాయడం మానేశారు.

కొంతకాలానికి తన అమృత వద్దనుండి ఒక ఉత్తరం వచ్చినది. "మీతల్లిగారు కోరినప్రకారం ఆమెను కలుసు కొన్నాను. ఈ అవకాశం యిచ్చినందుకు ఎంతో ఆనందిం చాను' కృతజ్ఞతతో, గౌరవంతో ఆమెపాదాలకు నమస్కారం చేశాను. ఒక విపరీతమైన కార్యం చెయ్యాలని, ఆమె నా చేతులు పట్టుకొని వేడుకొన్నది. నేను నిన్ను వాస్తవంగా ప్రేమించివుంటే నీమేలు నేను కోర్తానని, ఎంతైనా త్యాగం చేయుటానికి సిద్ధంగా వుంటానని, అబ్బ... ఏమని వ్రాయను? అసలు నిన్ను వదలివెళ్ళాలట; నీ తండ్రిగారు తనలక్షల ఆస్థిని నీకు యిస్తాడట; అంతట నీవు సుఖంగా ఉండవగలవట.

అంతేగాదు... పైగా మీా కులంలోనే, నీవు మళ్లీ పెళ్ళిచేసు కొనేలాగు ప్రోత్సహించాలట. అబ్బ! ఇక నాకలంపారదు... మీాఅమ్మ నిన్ను ఎంతో ప్రేమిస్తుంది. కాని కులపిశాచాన్ని ఏలా వదిలించుకోగలదు! మరి?... అని అమృత వ్రాసెను. ఆ వుత్తరంలో తన ప్రేయసి కన్నీటిబొట్లు కనపడినవి. ఎంతో దుఃఖించాడు. తిరిగీ తల్లిముఖం చూడకూడదని అసహ్యించు కొన్నాడు.

కొన్ని నెలలతరువాత స్వరాజ్యం వచ్చింది. కాంగ్రెసు నాయకులందరూ విడుదల అయ్యారు; వారితో, విద్యార్థి నాయకుడు పురుషోత్తంకూడా విడుదలై వచ్చాడు.

ఈవార్త తల్లికి తెలియగానే, "చచ్చిపోయే స్థితిలో ఉన్నాను. కడసారి చూచిపో, నాయనా!" అని ఎంతో దీనంగా కబురు పంపింది. ఆ వార్తనునమ్మి, తండ్రి ఇంటిలో ఉండని సమయం తెలిసికొని తల్లి ని కలుసుకొన్నాడు.

కారుశబ్దం వినవచ్చింది. "అయ్యగారు వస్తూవున్నారు" అని నౌకరు హెచ్చరించాడు. చటుక్కునలేచి వెళ్ళాడు, కొమారుడు. తండ్రి పలుకరించనేలేదు. భార్య గదిలోకివచ్చి, "రౌడీ విడుదలై వచ్చాడే! ఏమంటున్నాడు?" అని ప్రస్తా వించాడు.

తల్లి కళ్ళు మూసుకొన్నది, కాని కన్నీరు కారుతూ వుండెను. జవాబు చెప్పలేదు.

"నీ గుడ్డిప్రేమతో వానిని పాడుచేశావు; ఇంకా చేస్తూనే వున్నావు. కులాన్ని, వంశాన్ని నాశనం చేస్తు న్నాడు నీ సుపుత్రుడు.!!' అంటూ ఆఫీసు గదిలోకి వెళ్లాడు. ఆమె కళ్ళలో బొటబొట నీరు కారుతూనే ఉన్నది.



•

# సిగ్గుపడ్డాను

నా మిత్రుడు నారాయణరావు వద్దనుండి ఉత్తరం వచ్చింది. కొన్ని నెలలుగా నాకు వ్రాయడం మానివేశాడు. నా వుత్తరాలకు ప్రత్యుత్తరమైనా వ్రాయలేదు, స్నేహం తగ్గిపోయి వుంటుందేమో అనుకొంటిని. ఏదో విధంగా, ఎప్పుడూ, వానిని సతాయిస్తూనే ఉన్నాను. నామీద వానికి విసుగెత్తి వుంటుందని, ఇక వ్రాయడని, అనవసరంగా ఒక స్నేహితుని పోగొట్టుకొన్నానే అని విచారపడుతుంటిని.

అలాంటి సమయంలో, నా ప్రాణమిత్రుడు ఉత్తరం రాయగానే ఎంతో ఆతురతతో తెరచి చదివాను. చాల చిన్న ఉత్తరం. నాకు ఆశ్చర్యంవేసింది...

"కాకినాడలో ఒక భోగంయింటికి వెళ్ళాను. ఆవిడ చాల మంచిదిగా నాకుతోచింది. ఆవిడను వివాహం చేసుకో వాలని వుంది. ఆమెతో మాట్లాడి సహాయం చేస్తావా? తప్పక చేస్తావని నమ్మికొని ఉన్నాను, నారాయణ."

ఏమిచెయ్యాలో నాకు తోచలేదు. ఈలాంటి సంస్క రణ నాకు ఇష్టమే. అయినా, నా మిత్రుడు ఒక చిత్రమైన మనిషి. పది సంవత్సరాలుగా నేనెరుగుదును. వివాహం చేసు కోమని కొన్నిసంబంధాలు చూపించాను. కాని అతను ఒప్పు

కోలేదు. వానికొక దురభ్యాసం ఉంది. భోగం యిళ్ళకు వెడు తుంటాడు. ఎంతో చెప్పి చూచాను. వినిపించుకోడు చీవాట్లు పెట్టితే, తన్ను కాదన్నట్లు నవ్వి వెళ్ళిపోతాడు. ఈ దురల వాటు మానడు. జీతంకూడా బాగానే వస్తూవుంది; నెలకు రూ 300: ఇంజనీరు.

మరేలోపం వానిలోలేదు. అందువల్లనే వానిమీద నా కంత ఆ యిష్టం పుట్టలేదు! ఒకరోజు మరొక ధోరణిలో ప్రయత్నించాను. "భోగం వృత్తిలోవున్న స్త్రీలు నీచాతి నీచులు. వాళ్ళవద్దకు వెళ్ళేపురుషులు కూడా అంతనీచులే." అతను వాదనలోకి దిగనేలేదు. అలాంటి మనిషిని సంస్కరిం చడం సాధ్యంకాదను కొన్నాను!

మరికొన్ని సంవత్సరాలకు, మరొక ప్రయత్నం చేశాను. "నీవురోగాలు సంపాదించుకొంటావు. సిఫ్లిస్, గనో రియా, నిన్ను సర్వనాశనం చేస్తాయి" అని బెదిరించి చూచాను. ప్రయోజనం లేకపోయింది. ఈ లాగు, మా యిద్దరిమధ్య పది సంవత్సరాలు ఘర్షణ కొనసాగింది. అయితే నా మిత్రునిలో ఒక్క సుగుణం మాత్రంవుంది. అందుకు నేను మెచ్చుకోక తప్పదు. సంసారస్త్రీల జోలికి మాత్రం వెళ్ళడు!

ఆ వుత్తరం చదివాక, నా కర్తవ్యం స్థిరపరచుకొను టకు కొంతకాలం పట్టింది. ఆవిడ వీనిని మోసగించు తుందేమో?... చివరకు "ఇద్దరూ అలాంటివారే! ఫరవా లేదు" అనుకొని, ఆవిడతో మాట్లాడుదామని కాకినాడకు వెళ్లాను.

మధ్యాహ్నం మూడుగంటల సమయానికి కళావతి యిల్లు చేరుకున్నాను. అప్పుడప్పుడే నిద్రలేచింది. తలుపు తెరచి, తలుపువెనుక నిలబడి, ఆశ్చర్యంతో నావైపు చూచింది.

"మీతో పనివుండి వచ్చాను. నా స్నేహితుడు నారాయణరావు తెలుసునా? అని జేబులోనుండి ఉత్తరంతీశాను.

"నాకు తెలీదండీ" అన్నది విస్తుపోతూ.

"పదిరోజుల క్రితం ఒకరాత్రి మీయింటికి వచ్చాడు."

"నాకు సరిగా జ్ఞాపకం లేదండీ"

"నిన్ను వివాహం చేసుకుంటాడట. ఉత్తరంవ్రాశాడు. అందుకోసమే ఇంతదూరం వచ్చాను."

ఆవిడ చిరునవ్వు నవ్వి "నన్ను పరిహాసం చేస్తున్నారు. తమరెవరో నాకు తెలియదు. మరొక కళావతి అవతలివీధిలో ఉన్నది. పొరబడ్డారేమో!"

"లేదు, మీరని తెలిసే వచ్చాను." కాదన్నట్లు తల పంకించింది.

"సావకాశంగా మాట్లాడుకుందాం. లోపల వచ్చి కూచోవచ్చునా?" అన్నాను.

తలుపు పూర్తిగా తెరిచి, "కూర్చోండి, ఇప్పుడే వస్తాను" అని లోపలికి వెళ్లింది. పదినిమిషాలకు తల దువ్వుకొని, బొట్టు పెట్టుకొని, తెల్లనిచీర కట్టుకొని, తాంబూళం పళ్ళెరంతో వచ్చి కూర్చున్నది.

"తమ పేరు చెప్పరూ!" అన్నది.

చెప్పాను, లేచి నమస్కారం చేసింది "తమ పేరు విన్నాను. మాకులంవారికి సహాయం చేస్తున్నారని మాఈశ్వరుడుగారు ఉపన్యాసంలో చెప్పగా విన్నాను. మీ దర్శనం కావడం నా అదృష్టం."

"కూచోండి. మీకు వివాహం చేసుకోవాలని ఉన్నదా?"

"నన్ను వివాహం చేసుకొనేవా రుంటారా, నాన్నగారూ?" అని తల వొంచుకొన్నది. కళ్ళల్లో నీరు తొణికింది.

"మా నారాయణరావు చేసుకొంటానని వ్రాశాడు" అని ఉత్తరం యిచ్చాను.

చదువుకొని, కళ్ళనీళ్ళు తుడుచుకొని, వీరెవరో నాకు బాగా జ్ఞాపకం లేదండి. ఉదయాన వెళ్ళేటప్పుడు "నన్ను వివాహం చేసుకొంటావా?" అన్నారు. అది పరిహాసంమాటే ననుకొన్నాను. తిరిగి ఆయన కనుపించనేలేదు."

"ఏమని వ్రాయమంటావు?"

"సరేనని వ్రాయండి"

"అతను మరి ఏలాంటివాడో నీకు తెలియదా?"

"ఏలాంటివాడైనా సరే చేసుకుంటానండి."

"వాడు వ్యభిచారి"

ఏదో చెప్పవలెననుకొని మానివేసి తలవొంచుకున్నది.

"నీవు ఆ వృత్తిలో పుట్టి పెరిగావు. నిన్ను నిందించడంలో అర్థంలేదు, కాని వాడు తప్పుపనులు చెయ్యవలసిన అవసరంలేదు."

కొంతసేపటికి "ఆయన తప్పకుండా చాల విశాల హృదయం కలవాడై ఉండాలి. లేకపోతే, ఈ ఉత్తరం వ్రాయలేడు" అన్నది. ఆనంద బాష్పాలను నేను వాస్తవంగా అప్పుడే చూచాను.

"వానిని నీవు బాగుచెయ్య గలిగితే...

"మీరు సంశయించకండి. నాన్నగారూ – మేమిద్దరం సుఖంగా ఉంటాము."

"ఆమె ఆత్మవిశ్వాసం, నన్నెంతో సంతృప్తి పరచింది. ఆమెకు నాగపూరుకు ప్రయాణం ఖర్చులికిచ్చి, తిరిగి గుంటూరు చేరుకున్నాను.

పెండ్లి చేసుకున్నామని ఒక ఉత్తరం; సుఖంగా వున్నామని మరి కొంతకాలానికి; కొడుకు పుట్టాడని; ఈలాగు సంవత్సరానికి రెండేళ్ళకు ఒక ఉత్తరం; వస్తూవుండినది, నాకు "నాన్నగారూ" అని తన భర్తను గురించి "మీ అల్లుడు గారు" అని చాల కలియగలుపుగా ఆమె వ్రాస్తూవచ్చింది.

ఈ పెళ్ళి చేయించానేగాని, నన్నొక సంశయం, వేధిస్తూనేవుంది. ఇందులో ఏదో లోపమున్నదని, ఈ సంబంధం జయప్రదం కాజాలదని, నేను తప్పుచేశానని, అనుకొంటూ వచ్చాను.

అయిదు సంవత్సరాలే అయింది? "ప్రసవసందర్భంలో ఆమె హఠాత్తుగా చనిపోయింది," అని దుఃఖంతో నారాయణరావు నాకు వ్రాశాడు. తానెంతో సుఖపడినానని, అలాంటి భార్య లభించడం తన పూర్వజన్మ పుణ్యమేమోనని, అలాంటి స్త్రీ మరొకతె ఉండదని, ఆవిడలేని జీవితం

తనకు చాల భారంగా ఉందని, జీవితంలో తనకు రుచిపోయిం దని ఏమేమో దుఃఖంతో నిరాశతో వ్రాశాడు.

కాని, ఇతనిపై సంశయం నాకు పూర్తిగా పోలేదు తిరిగి వ్యభిచారి అవుతాడేమోనని సంశయించాను. తిరిగి వానికి వివాహం చేయించితే బాగుండునని, అతని దుఃఖాన్ని కొంత మరపించవచ్చునని ఆలాటి అవకాశం కలుగ చెయ్యడం మంచిదనీ, తిరిగి వివాహం చేసుకోమనీ, సలహాయిస్తూ వ్రాశాను. అతనందుకు సమ్మతించ లేదు.

అతనికి సరియైన స్త్రీ లభించినప్పుడు, తప్పక గట్టిగా ప్రయత్నించడం మంచిదని సమయానికై కనిపెట్టుకొని ఉంటిని. అలాగే ఒకరు లభించారు ఆమెను వెంటపెట్టుకొని నాగపూరు వెళ్లితిని.

తన ప్రేమను, హృదయాన్ని, పూర్తిగా కళావతికి యిచ్చివేశానని, మరొక స్త్రీ తనవల్ల సుఖపడజాలదని, తనూ ఆమెవల్ల సుఖపడజాలనని చెప్పాడు. అతనిలో మార్పును నేనేమో పూర్తిగా నమ్మలేదు. వ్యభిచారం అనేది ఒకమనో వ్యాధి అని, పిచ్చిలాగే అది శాశ్వతంగా నయంకాజాలదని నాకొక నమ్మకం.

కాని నామిత్రుడు తిరిగీ దురభ్యాసానికి తావివ్వలేదు. పూర్తిగా మారిపోయాడు. ఉద్యోగంలో చురుకుతనం పోయింది. నలభై సంవత్సరాల వయసుకే. కొద్దిపెన్షనుతో రిటైరయ్యాడు. చనిపోయేముందు, ఒకఫోటో పంపాడు దానిలో తాను తనభార్య ఉన్నారు. దానివెనుక ఈలాగు వ్రాశాడు:

"నాసుస్థిర పవిత్ర ప్రేమలో నమ్మకంలేని నామిత్రునికి- నారాయణ 3-1-35." నా అజ్ఞానానికి సిగ్గుపడ్డాను.



# తెరమరుగున

1907 సం॥లో ఒంగోలు హైస్కూలులో సీతాపతీ, నేనూ, విద్యార్థులం. ఒకేగదిలో ఉండేవాళ్ళం. మాకు ఆగది ముసల్మాను యింటిలో లభించినది. ఆయిల్లు ఊరికి చివరలో ఉండినది. యింటిలో రెండు పెద్దగదులూ ఒక్క వరండా మాత్రమే. ఒక్క గదీ, సగం వరండాలో, ఇంటివారు కాపురం; మిగతాగది సగం వరండాలో మేముండేవాళ్ళము. ఈవరండా వీధివైపుగాక, దొడ్డివైపు ఉన్నది. వీధివైపు తలుపులుగాని కిటికీలుగాని లేవు. ఇరుగుపొరుగులకుకూడా కొంచెందూరమే. ప్రశాంతంగా వుండేది. మా చదువులకు చాల అనుకూలమైన యిల్లు.

ఇంటివారు ఇద్దరే. పెద్దగదిలోనే వంట చేసుకొని, భోంచేసి పడుకునేవారు. వరండాలో సగంభాగానికి తెర అడ్డం కట్టుకొన్నారు. వరండాకు ఆనుకొని స్నానానికీ మరుగు దొడ్డికీ, తాటాకులతో అడ్డం కట్టుకొన్నారు.

ఇంటిలో ఒక ముసలమ్మ ఆమెకోడలు మాత్రమే ఉండిరి. అత్తగారికి 60 ఏళ్ళు ఉంటాయి; కోడలు చిన్నది. ఇరవై ఏళ్ళు. పెళ్ళిఅయి ఒక్క సంవత్సరం మాత్రమే. ఈవిడ ముసలమ్మ పెద్దకొమారుని భార్య. అతను పోలీసు జవాను. యిరవైమైళ్ళ దూరంలో ఒక గ్రామంలో ఉద్యోగం. నెల

కొకసారివచ్చి మూడునాలుగు రోజులుండి పోతూవుండెను. రెండవ కొమారుడు నలభై మైళ్ళ దూరంలో తాలూకా ఆఫీసు ప్యూను! వివాహం కాలేదు.

అవ్వగారు చాల మర్యాదస్తురాలు. అంతవయసులో కూడ తలమీద ముసుగు వేసుకొనేది. ఎవరైనా తమ ఇంటికి వస్తే, తలమీ ది ముసుగును ముఖంమీదికి లాక్కొని, తల వంచుకుని, మాట్లాడేది. మాకు వింతగా వుండేది. మేము కొన్ని నెలలు ఉండిన తరువాత ఆమె మమ్మల్ని తన మను మలులాగ ఆదరించేది కాని, మాతో మాట్లాడునప్పుడుకూడా ముసుగు మానలేదు

సీతాపతి హాస్యగాడు. "అవ్వగారూ! మీరు ముసు గేసుకొంటే నేను మాట్లాడను" అనీ, "అవ్వగారు వస్తు న్నారు! కళ్ళుమూసుకోండి!" అనీ తరుచుగా ఎగతాళిచేసే వాడు. ఆమె పకపకనవ్వుతూ ముసుగుతీసేసి.

"మర్యాదకు నాయనా! అది మా సాంప్రదాయం. మానం మర్యాదలేని జీవితం ఎందుకునాయనా?" అని సమా ధానం చెప్పేది.

"అవ్వగారూ! కుర్రవాళ్ళనుచూస్తే మీకు సిగ్గుఅను కొన్నాము," అని నవ్వేవాళ్ళం.

ఇంటికి ఎవరైనావస్తే, ఆమె మాత్రమే జవాబు చెప్పాలి; కోడలు చెప్పనేకూడదు. అసలు, ముసలమ్మ పగలు బయటికి వెళ్ళదు. సాయంత్రం చీకటిపడ్డ తర్వాత, ఇరుగు పొరుగు ముసలామ్మల ఇండ్లకు వెళ్లేది. తెల్లవారుజామున, మూడునాలుగు గంటలమధ్య మసీదుకువెళ్ళి, నవాజు చేసు

కొని, ఖొరాను చదువుకొని, తెల్లవారకముందే ఇంటికి చేరు కొనేది. ఆత్మగౌరవ విషయంలో మనస్త్రీలకు ఎంతమాత్రమూ తీసిపోలేదు.

కోడలు మాకుకనపడటమేలేదు. ఆమె అందచందాలు చూడాలని మాకెంతో కుతూహలం. మేమెంతో ప్రయత్నించాము. ఎన్నెన్నో ఉపాయాలుచేశాము. మేము ఇంటిలో లేనట్టుకూడా నటించాము. మా పాపిష్టికళ్ళకు ఆమెముఖం కనిపించనేలేదు. ఆమె చేతిగాజులు, కాళ్ళ కడియాల చప్పుడు వల్ల ఆమె అక్కడ వుందని అనుకొనేవాళ్ళం. అత్తగారితో మాట్లాడినప్పుడు కూడ, మెల్లగా మాట్లాడేది.

ఒకరోజు ఆమెను ఏలాగోచూచేశాం. పొడవుగా వుంది; పొడవుకు తగినలావు; పసిమిరంగు; అందమైనముఖం. కాని ఆ పెద్దబులాకి, చెవులనిండుగ ఉంగరాలు, ఆమెను అందవికారం చేశాయి.

ఆవిడకు చదువుసంధ్యలు కూడాలేవు. బోనులోఉన్న మృగంలాగు, కాలంగడుపుతూ ఉంది. ఇరుగుపొరుగు ఇండ్లకు కూడ వెళ్ళదు. "అయ్యో! ఇది ఒక జీవితమేనా? పూర్వ జన్మలో ఏమి పాపంచేసి ఈలాగుపుట్టినదో"అని జాలిపడుతూ వుంటిమి. ఆమె దుర్గతినిగురించి, మేమిద్దరం మాట్లాడుకొన్న ప్పుడల్లా, మాకు దుఃఖంకూడా వచ్చేది.

అత్తా కోడలు అన్యోన్యంగా ఉండిరి; పెద్దకుమారుడు వచ్చినప్పుడు కోడినికోసి, పులావు చేసుకొని తినేవారు. అతను చిన్నవాడు; 30 సం॥ల వయసు. ఆరోగ్యవంతుడు; బలశాలి; పెద్దమనిషి; కలియగలుపు కలవాడు; మాతో నవ్వుతూ

మాట్లాడేవాడు. "పులావు తింటారా?" అని పరిహాసం చేసే వాడు.

ఒకరోజు రెండవ కుమారుడు వచ్చాడు. పుచ్చిన ముఖం; ఒకకన్నులో కాయ; వానినడక, వానివైఖరి సరిగా లేదు అతనితో మేముకాని, మాతో అతనుకాని మాట్లాడు టకైనా ప్రయత్నించలేదు. వానిని చూడగానే వానిమీద మాకు అసహ్యం వేసింది.

మేము మెట్రిక్లేషన్ పరీక్షకు కష్టపడి చదువుకొంటు వుంటిమి. రాత్రి 11, 12 ఘంటలవరకూ చదివేవారము; తిరిగీ తెల్లవారుఝామున నాలుగు గంటలకు ముందుగానే లేచి చదివేవాళ్ళము.

ఆరోజు మేము లేవటానికి ముందుగా ప్రక్కగదిలో ఎవరో మూలుగుతున్నట్టు నా చెవిని బడ్డది. సీతాపతికి వినబ డ్డది. సందడి చేయకుండ అల్లాగే మాపక్కలమీద కూర్చు న్నాం. తిరిగీ మూలగడం వినబడ్డది... దానితో గాజులు కడి యాల చప్పుడు కూడా... ఆ చప్పుడు ఆయింటి కోడలిదని గుర్తుకొచ్చింది... మరికొంతసేపు ఆలకించాం... ఇద్దరు పెనుగు లాడటం, ఒకరినొకరు నెట్టుకోవటం... మూలగటం... కేక వేస్తున్న నోటిని మూసినట్టు... విషయాన్ని గ్రహించు కొన్నాం. పాపం! ఇంటికోడలు తన శీలాన్ని కాపాడుకోటా నికికోసం... ఎన్నో బాధలు పడుతూవుంది. యథాప్రకారం అత్త మసీదుకు వెళ్ళింది, మరిదిమాత్రమే ఉన్నాడు.

మాకు ఒకవైపు ఆశ్చర్యం, కోపం; భయంకూడా! తురకలు ఆకాలంలో చాల గడుసువారు. మేము దీపం పెట్ట

కుండా, చెవులు నిక్కపొడుచుకొని వింటూవుంటిమి. ఈ ఘోరనాటకం ఏలాగు పరిణమించునో అని తహతహలాడు చుంటిమి. ముసలమ్మ ఇంటికి వచ్చేసమయం. వాడు బయటకు వెళ్ళిపొయ్యాడు. తిరిగీ నిశ్శబ్దం.

ముసలమ్మ వచ్చింది. దీపంపెట్టాము. అత్తతో చెప్పుకొని ఏడుస్తుందనుకొంటిమి. అలాంటివేమీ జరగనేలేదు. మామూలుగానే నిశ్శబ్దంగా గృహకృత్యాలు జరిగిపోతూ వుండినవి. మాకు ఆశ్చర్యం! వాడు తిరిగీ యింటికి రాడనుకొంటిమి. లేదు; వచ్చాడు: చద్దిఅన్నం వడ్డించింది, కోడలు; తిన్నాడు, వెళ్లాడు. తిరిగి సమయానికివచ్చి భోంచేసి రైలుకు వెళ్ళాడు. తల్లి సాగనంపింది. అవ్వగారు మామూలుగా నవాజుచేస్తూనే వుండింది.

మా ఆశ్చర్యానికే కాదు; మా ఆలోచనా పరంపరలకు కూడా అంతం ఉండలేదు. మొగునితో తప్పక చెబుతుందని మేము నిశ్చయించుకొన్నాం. తమ్ముణ్ణి నరికేస్తాడేమో అలాగు కావలసిందేనని కూడా అనుకొన్నాం. ఈ సంఘటన జరిగిన నాలుగురోజులకు భర్తవచ్చారు. సమస్తం మామూలు మాదిరిగా జరిగిపోయినవి. కోడిని కోశారు; పులావు కూర్మా పరోటా చేసుకొన్నారు. వెంబడిగదిలో నుండి సువాసన ఘుమఘుమా వస్తూనేవుంది. భర్త మూడురోజులుండీ, సంతోషంగా కాలంగడిపి, తిరిగి తనపనికి వెళ్ళాడు. నేనూ సీతాపతి ఒకరిముఖాలు ఒకరు చూచుకొంటిమి.

"ఇదేం గోషారా!" అన్నాడు సీతాపతి. "అది గోషా కాదురా, ఘోషరా" అన్నాడు సుబ్బారావు.

"తెరచాటున, ఎంత భాగవతం!"



# అనాధ కామేశ్వరమ్మ

'వర్మాముగారూ!...' అని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. ఇక మాట్లాడలేక పోయింది. నా రెండుచేతులూ పట్టుకున్నది.

'అయ్యో; తల్లీ; రాలేకపోయానే! ఏంచెయ్యను! ముసలితనంలో సంసార గొడవలు, బాధ్యతలు ఎక్కువయి నాయి.' కంటనీరు పెట్టుకొన్నాను.

'దిక్కులేనిదానికి మీరే దిక్కనుకొన్నా. మీరు కూడా మరిస్తే...' మళ్ళీ ఏడ్వసాగింది.

'లేదమ్మా: ఎలా మరుస్తాను? చెప్పాగా నా గొడవలు.'

'ఆయన చనిపోయిన తరువాత, ఒంటరిగా జీవించడం చాలా కష్టంగా ఉన్నది. కండ్లు మూసుకపోతే బాగుండును. ఐతే చావురాదు. ఆత్మహత్య చేసుకోవడం నాకు యిష్టంలేదు.

'కామేశ్వరీ! ఈలాగు దుఃఖిస్తూ వుండడం సరికాదు. నీవు చేయవలసిన సంఘసేవ ఎంతోవుంది. స్వరాజ్యంవచ్చినా స్త్రీలకష్టాలు తొలగలేదు. అష్టదరిద్రంలో మునిగిన దిక్కు లేని అనాధ లెందరున్నారో ఊహించుకో. దుఃఖం మరచి పో' అని ఓదార్చుటకు ప్రయత్నించాను.

రాత్రి భోజనాలు అయినాయి. హాలులో కూర్చు న్నాము. భర్తగారి ఫోటోను, గాంధిగారిఫోటోను పూలదండ లతో అలంకరించింది. ఊదువత్తులు వెలుగుతూ వున్నాయి.

'మామగారూ! ఆయన హృదయం ఎంత విశాలము. నన్ను తన ప్రేమతో ముంచేశాడు. నాతప్పులు ఎన్నెన్ని మన్నించాడు? ఆయన ఆలాగు వృద్ధికి తెచ్చి వుండకపోతే, నేను అధోగతిపాలయి వుందును. మహానుభావుడు, అలాంటి వారు మరొకరుండరు,' అని తమ జీవితవిషయాలు జ్ఞాపకం తెచ్చుకుంటూ వుంది. అలాగు విలపించడం మంచిదేనని తలంచి, చెప్పనిచ్చాను.

'నాకు తెలియదా? చిన్నప్పటినుండి నిన్ను ఎరుగుదును. డాక్టరూ నేనూ బాల్యమిత్రులం. మనలో ఒకరిని గురించి మరొకరికి తెలియని రహస్యాలు ఏమున్నాయి? డాక్టరు గొప్పవాడు వాస్తవమే! ఆయన ఇచ్చిన అవకాశాన్ని నీవు వినియోగించుకొని, ఈలాంటి ప్రేమమూర్తివి కావడంలో, నీవుకూడ చాలా గొప్పదానవే'.

'మామగారూ! మీకు కొన్ని విషయాలు తెలియవు. నన్ను వివాహం చేసికొన్నాడని తెలియగానే, నన్నుగురించి ఆయనకు ఎన్నెన్ని వుత్తరాలు వచ్చాయి. నేను వ్యభిచారినని, తాను వ్యభిచారాన్ని ప్రోత్సహించు చున్నాడని, సంఘాన్ని నాశనం చేస్తున్నాడని, సంఘానికి తాను ఒకటవ నంబరు శత్రువునని, తిట్టి, బెదిరించి వ్రాశారు."

'మీ యిద్దరి వివాహాలు ఖండిస్తూ వుత్తరాలు వచ్చాయని వినాయకరావే నాతో అన్నాడు. అయితే నీచులు అంత క్రూరంగా వ్రాశారనిమాత్రం నాకు చెప్పలేదు.

"తాను చదివి, నన్ను చదువుకోమని యిచ్చి నవ్వేవారు. నాకు పట్టరాని దుఃఖము వచ్చేది. ఇది చూచిన

తర్వాత ఉత్తరాలను తెరవడమే మానేశాం. ఒక డ్రాయరు నిండా అవే" అని కామేశ్వరి తల వొంచుకొన్నది.

'డాక్టరు వినాయకరావు ఏదీ త్వరపడి తీర్మానించు కోడు తీర్మానించుకొన్నాడా, అతని మనసును మార్చ లేము. ఎన్ని కష్టాలకైనా ఓర్చుకోగలడు. ఎందరో చేయ జాలని సంస్కరణలను ఆయన చేయించగలిగాడు. ఆ విష యంలో ఆయన మనందరికి మార్గదర్శి'

'ఆ వుత్తరాలతో క్రుంగి కృశించి పోయాను.

'కామేశ్వరీ! నీవేకాదు, తప్పులు చేసింది. నేను మాత్రం తప్పులు చెయ్యలేదా? అందరం కొద్దోగొప్పో చేశా మన్నమాటే నీవు తప్పుచేశావని అనడానికినాకుగాని, సంఘా నికిగాని హక్కులేదు. హేయమని గుర్తించుకొన్నావు. మానే శావు. నీజీవితమే మారిపోయింది. మనదాంపత్యం పవిత్రమనే నాభావం. మరచిపో. ఉత్తరాలను కాల్చివెయ్యి' అన్నాడు: కాల్చివేశాడు. ఎంత గొప్ప హృదయమండీ!

ఆరాత్రి నాకు చాలసేపు నిద్రపట్టలేదు. చిన్నప్పటి విషయాలు నాకు జ్ఞాపకంవస్తూనే వుండినాయి. కాలేజీలో చదువుకొనే కాలంలో, వినాయకరావు, నేను కామేశ్వరమ్మ తండ్రిగారి యింటిలో ఒక గదిలో వుంటూవుంటిమి. ఆయన ద్రవ్యవంతుడు. మా కుటుంబాలకు చాల దగ్గర స్నేహితాలు ఉంటూవుండినయి. కామేశ్వరమ్మ అన్న రామారావు మా సహాధ్యాయి. ప్రాణస్నేహితులమయ్యాము.

అప్పుడు కామేశ్వరికి పదిసంవత్సరాల వయస్సు. నన్ను మామా అని, వినాయకరావును చిన్నమామా అని పిలుస్తూ

వుండేది. చాల అందగత్తె. ఆ యింటిలో అందరూ అంద గాళ్ళే. మా చెల్లెలాగు, కామేశ్వరి మాకు కావలసిన పను లన్నీ చేసిపెట్టుతూ వుండేది. మాతో ఆడుకొనేది! పాటలు పాడేది; చదువు చెప్పించుకొనేది' మాతో వుండడం ఎంతో సరదా. ఒక్కొక్కప్పుడు మా మంచాలమీద నిద్రపొయ్యేది. ఆవిడ బాల్యం, అమాయకత్వం, వైధవ్యంచూచి మాకెంతో దుఃఖము, జాలి కలిగేది.

తొమ్మిదేళ్ళ ఈడుకే వితంతువైంది. తల్లి తనబిడ్డకు నగలుపెట్టి, పట్టు కుచ్చుళ్లు కట్టి, వాలుజడవేసి, పూలుపెట్టి అలంకరించేది. ఒంటరిగా కండ్లనీరు పెట్టుకుంటూ వుండేది. కామేశ్వరి తనకు రాబోయే కష్టాలుగాని, సంఘంలోని అమానుషత్వం, అవినీతిగాని, అర్థం చేసుకోవడమే లేదు. దేహం పెరిగినంతగా బుద్ధి పెరగడంలేదు. వయసుకు తగినట్లు తెలివితేటలుగాని లజ్జ మొదలయినవిగాని, తోటి పిల్లల్లోలాగు అభివృద్ధికి రావటంలేదు. మానసికంగా పెరగకపోవడం చాల అపాయమేనని భయపడేవాళ్ళం.

ఈ కష్టాన్ని ఏలాగు నివారించాలో, మేము ముగ్గురం పదేపదే యోచించు చుండేవాళ్ళము; కాని పరిష్కార మార్గం తోచటంలేదు. తిరిగీ వివాహం చేయించటానికేమో తల్లిదండ్రులు సాహసించలేరు; సాహసించినా చేసుకునేవాళ్లు కనపడరు. అప్పటి అవినీతిసంఘంలో కామేశ్వరి దుర్మార్గు లకు బలియగుననీ, దాని సౌందర్యమే తనకు శత్రువగుననీ, విచారపడుచుంటిమి. వినాయకరావుకు కంటిలో నీరు కమ్ము చుండేది. ఆయనది చాల జాలిగుండె.

అప్పటికే నాకు, మా పెద్దలు వివాహం చేయించేశారు. ఇక వినాయకరావు విషయంలోను అంతేను. కాకపోయినా, వితంతువివాహం చేసుకొని, మామా, తల్లిదండ్రులను, బంధు మిత్రులను ఎదిరించే సాహసమెక్కడిది? మేము ఆర్థిక పరాధీనులము కదా! మాకెంతో ఉన్నతభావా లుండినప్పటికీ, మాశక్తిహీనతను తలచుకొని కృంగిపొయ్యేవాళ్ళం. ఆనాటి దిక్కుమాలిన సంఘంలో ఈలాంటి సమస్యకు పరిష్కారమే లేదు.

వినాయకరావు డాక్టరయ్యాడు. మద్రాసులో ప్రాక్టీసు పెట్టాడు; రామారావు రాజమండ్రిలో వకీలు నేను గుంటూరులో టీచరు. అందరం క్రిస్‌మస్ శలవుల్లో మద్రాసులో డాక్టరుగారియింటిలో కలుసుకుంటూ వుంటిమి. మాకు ముఖ్య విషయం మా కామేశ్వరిని గురించేను.

కామేశ్వరిని మా సొంత చెల్లెల్లాగు భావించుకొంటూ, ఆవిడ యోగక్షేమాలు తెలుసుకొంటూ వున్నాం. సంతోష కరమైన వార్తలు రావడమేలేదు. వ్యభిచారి అయిపోయింది. గౌరవమర్యాదలను లక్ష్యపెట్టటం లేదు. ఇక అది బాగుపడదు, ఇక దానిగురించి యోచనలు మానివెయ్యండి' అని అన్నగారు రామారావు చెప్పి, కండ్లనీరు పెట్టుకొన్నాడు. ఏలాగైనా దారికి తెస్తామనే ఆశతో ఆవిడకు అప్పుడప్పుడు వ్రాస్తూ వుంటిమి.

కొంతకాలానికి ఆవిడలో మార్పు వచ్చింది. హఠాత్తుగా మనసు మార్చుకొన్నది. సంఘంలో మర్యాదగా జీవించాలని కోరిక కలిగింది. గాంధిగారి పవిత్రమైన ప్రజోద్య

మాలు, దేశమంతటా ఒక వెల్లువలాగు వ్యాపిస్తూవుండినాయి. ఆయన నిర్మలహృదయము, ఆయన మానవసేవ, ఆయన త్యాగము కామేశ్వరమ్మను ఆకర్షించాయి. ఆమెను మార్చి వేశాయి. అన్నగారికి ఆశ్చర్యం వేసింది; పట్టరాని సంతోషం కలిగింది. అయితేనేమి? ఆమెజీవిత పర్యంతమూ, సంఘంలో ఆమెను వ్రేళ్ళు పెట్టి చూపించుచునే వుంటారని విచార పడ్డాడు.

'సంఘసేవ చెయ్యి - ఆవిధంగా మనసు మారల్చుకో! గతాన్ని గురించి దుఃఖిస్తూ వుండడం చాలదు - సంఘంలో ఎంతో కుళ్ళువున్నది- మావద్దకురా! మా అనాథ స్త్రీ శిశు శరణాలయంలో, నా భార్యకు సహాయంచెయ్యి' అని డాక్టరు గారు సలహా యిచ్చాడు. కాని పై అంతస్తుకు ఎక్కలేకపో యింది, డాక్టరుగారి భార్య ప్రసవసమయంలో హఠాత్తుగా మరణించింది. వారిద్దరూ ఎంతో ప్రేమించుకుంటూవుండే వారు, సంఘసంస్కరణోద్యమంలో ఇద్దరూ ఉత్సాహంతో పనిచేస్తూ, తద్వారా తమప్రేమను పవిత్రంచేసుకొంటూ ఆదర్శదంపతులయిరి. డాక్టరుగారు దుఃఖంలో మునిగిపోయిరి. కాని కొద్ది కాలంలోనే తనభార్య నిర్వహించుచుండిన Foundling's Home ను (అనాథ శిశు శరణాలయము) అభి వృద్ధికి తేవాలని, తద్వారా తన భార్యకోరికను నెరవేర్చడం అవసరమని, భార్యావియోగాన్ని గురించి ఎప్పుడూ దుఃఖిస్తూ వుండడం మానవధర్మం కాదని, తన మనస్సుకు శాంతి తెచ్చుకొన్నాడు.

డాక్టరుగారిని వివాహం చేసుకోవలెనని కామేశ్వరి ఆశపడ్డది. కాని ఆయనకు వివాహంమీద మనసు పోలేదు. ఆశ్రమంలో పనిచేస్తానని వచ్చేసింది. ఎంతో శ్రద్ధగా నిర్వహిస్తూవుండింది. సంఘసేవమూలంగా వారిహృదయాలుకలిసినవి. దంపతులయ్యారు సుఖంగా వుంటూవుండిరి. కామేశ్వరమ్మను క్రొత్తగా చూచినవారు ఆమెనుగురించిన గత చరిత్రను నమ్మజాలకపోయిరి.

ఉదయాన కాఫీతాగుతూ 'కామేశ్వరీ! Foundling's Home ఏలాగుందమ్మా?' అని అడిగాను.

'మనసుపెట్టి పని చేయలేకుండా వున్నాను మామగారూ.'

'చనిపోయినవారిని గురించి ఎప్పుడూ దుఃఖించుచూ వుండడం తప్పుకదూ? మన సేవాధర్మం మరచిపోకూడదు. వినాయకరావుమీద నీకువుండే ప్రేమను, తనబిడ్డ అయిన 'Foundling's Home,ను వృద్ధికి తేవడంలో కనుపరచాలి' అని అన్నాను. కొంతసేపు ఆమె ఆలోచించి "మామగారూ! మీతో నాదుఃఖాలు వెళ్ళపోసుకోవాలని ఉండింది. వృధాపోలేదు ఆలాగే ప్రయత్నిస్తాను" అన్నది.



# వెర్రి వెయ్యి విధాలు

"గోపాలరావుకి ఏం పొయ్యేకాల మొచ్చింది!' అన్నది ఒక ఆవిడ.

'ఔనటమ్మా! కమలను చెయ్యిపట్టి లాగాడట!' అన్నది మరొక స్త్రీ.

'చెల్లెల్ని చెయ్యిపట్టి లాగడమే! ఎంత దుర్మార్గం! ఏం పొయ్యేకాలం మొచ్చిందే!' అన్నది మరొకతె

"కమలచెల్లెలు ఎందుకయిందే! మేనమామ కుమార్తె: గోపాలం, కమలా, అన్న చెల్లెలులాగ పెరిగారే!'

'పాపం తల్లి లేని పిల్లకు ఎన్నికష్టాలు'

'తల్లి లేకపోవడమేమిటి? తల్లి బ్రతికేవున్నది పిచ్చి పట్టింది, అప్పటినుండి మేనత్తవద్ద వుంచాడు తండ్రి '

'వయసువచ్చి రెండేండ్లయింది. తండ్రి ఎందుకు తీసుకెళ్ళలేదో! పెండ్లి చేయించకూడదూ ?

'గోపాలరావుకు యివ్వడట. బీదవాడనీ: తండ్రికి 1500 జీతం, కమలకు తల్లి తాలూకు యిరవై వేల ఆస్తికూడావుందట.

'ఇంత ఉందిగదా! గోపాలుకిచ్చి పెండ్లిచేస్తే సుఖపడతారు! ఈ అల్లర్లుండవు గదా?'

'ఆయ నెందుకిస్తాడే? నూరు రూపాయల జీతగానికి? ఏ ఐ. సి యస్. ప్యాసయినవారికో, ఏ లక్షాధికారికో పెండ్లి

చేస్తాడుగాని! మంచిసంబంధం దొరికేదాక కమలను చదివిస్తాడు.'

గోపాలాన్ని కూడ మేనమామే చదివించాడట! ఉద్యోగంకూడ ఆయనే యిప్పించాడట. లేకపోతే వంట బ్రాహ్మణుడుగా జీవించేవాడు.

'వాడికి కృతజ్ఞత అయినా లేదేమే!'

'చిన్నప్పుడు చాల మంచివాడే! తల్లి ఎంతమాత్రమూ దుఃఖపడకూడదు! నీళ్ళు తోడేవాడు, బట్టలుతికేవాడు. ఇంటిలో పనులన్నీ చేసిపెట్టాడు!'

'అంతేకాదే? కమల బట్టలుకూడ ఉతుకుతాడు! దానికి చదువు చెప్పేవాడు! ఇప్పుడు ఈలాగైపోయ్యాడు కాని.'

'వాడుమాత్రం ఏమి చెయ్యగలడు. విస్తర్లో,మిఠాయి వడ్డించి, తినకూడదంటే ఎలాగన్నూ,

'వానితల్లి దానిని కాపాడడం లేదటే;'

'కాపాడాలిసిందే ! ఆవిడకూడ ఈ పనున్నగడలో పాల్గొంటుంటే! అంత ఆస్తి, అలాంటికోడలు, ఎంత పుణ్యం చేసుకొనివుంటే లభిస్తాయి?

చెల్లెల్లాగు పెరిగింది; వద్దని ఎంతో బ్రతిమాలిందట తల్లి. రాత్రిళ్లలో కంటిమీద రెప్పవాల్చకుండ ఎంతో కాలం కాపాడింది. అడ్డపడిందని గోపాలం క్రరతో బాదాడు, తల్లిని.స్పృహతప్పి పడిపోయింది డాక్టరువచ్చి చికిత్సచేశాడు.

'మూడురోజులు ఉపవాసం చేసింది కూడా.

'ఎంత సంగనాచే లక్ష్మమ్మ! ఆలాగైతే. పిల్లను తమ్మునివద్దకు పంపలేదు?'

'ఆయన తీసుకెళ్ళండే! ఢిల్లీలో ఉన్నాడు; ఎంతో దూరం. ఆయనకు రెండో పెళ్ళి. చిన్నపిల్లను అందగత్తెను పెండ్లి చేసుకున్నాడే! తనయింటిలో ఎన్ని ఇబ్బందులో ఎవరికి తెలుసు?'

'సరేలే! ఈలోగా గోపాలం గుటకాయస్వాహా చేస్తాడు. అప్పుడు ఆయనకు వాతపెట్టినట్టవుతుంది!'

'పాపిష్టిఆస్తి అడ్డురాకపోతే, గోపాలుకంటె మంచి అల్లుడు ఆయనకు లభిస్తాడా? వాడు దాన్ని పూలల్లో పెట్టి పూజిస్తాడు!'

'ఇంతకీ కమలవైఖరి ఎలాగుందే!'

'మొదటిరోజుల్లో, చెయ్యిపట్టిలాగితే, నవ్వి తప్పించుకొంటు వుండిందంట. బలవంతాన ముద్దుపెట్టుకుంటే, ఏడ్చి అత్తతో చెప్పిందట! అత్త నవ్వుతూ కొడుకును 'అలా చెయ్యడం తప్పుకద(టా!' అని అన్నదట. అటు తరువాత మర్యాదకోరకు కమల అత్తకు చెప్పడం మానేసింది. చదువు మానేసింది. సంగీతం పాడడమే లేదు. మంచిబట్టలయినా వేసుకోదు. కృశించిపోతున్నది. గోపాలంమీద అసహ్యంపుట్టిందే పాపం! అన్నలాగు భావించింది!'

ఇరుగింటి పొరుగింటి స్త్రీలు, మధ్యాహ్నం 12 గంటలు మొదలు మూడుగంటలవరకు ఈలాంటి కబుర్లు చెప్పుకొని, కాఫీ(తాగే వేళకు ఇండ్లకు చేరుకున్నారు.

తండ్రి, కమలపోషణకు ధారాళంగా డబ్బు పంపేవాడు. అక్క లక్ష్మమ్మను నమ్మాడు. ఆమె వితంతువు. 15 సంవత్సరాలుగా బిడ్డలు లేరు. కమలను (పేమతో పెంచు

కొని ఆనందించుతూవచ్చింది. 'నాకోడలయితే ఎంత బాగుం డును" అనుకొంటుంది; కాని, అంతస్తుల్లో భేదం తనకు బాగా తెలుసు. తనకూతురుకి చేయవలసిందంతా చేసేశానని, తండ్రి తృప్తిచెందాడు. కూతురిని రెండు సంవత్సరాలుగా చూడడానికైనా రాలేదు. తన ఉద్యోగం తన ఫయిళ్లు; తన ప్రమోషన్లు! తన చిన్నభార్య; ప్రపంచంలో మునిగిపోయ్యాడు. కూతురు వ్యవహారంకూడా అనేకఫయిలుగా మారిపోతూ వచ్చింది. ఆఫీసుపనులతో ఇంకా గొప్ప ఉద్యోగానికెళ్ళాలనే ఆశతో, హృదయంలేని ఒక యంత్రంగా మారిపోతూ వచ్చాడు. చివరకు తనమామకు వ్రాశాడు, ఆ ముసలాయన రాగానే 'తాతా; నన్ను తీసుకెళ్లు' అని ఏడ్చింది కమల. లక్ష్మమ్మ ఎంత బ్రతిమిలాడినా ఉండలేదు. తను ఆశించిన ఆస్తి, భార్య పోయిందనుకొని, గోపాలం నిరాశచెందాడు. దేవుళ్లను ఎక్కువగా పూజించడం ప్రారంభించాడు. ఛాతీ విరిచినడవడం మానేశాడు.

కమల అమ్మమ్మను పట్టుకొని ఏడ్చింది. కృశించిన కమలనుచూచి దుఃఖించింది, అమ్మమ్మ.

"కమల! ఇక నాదగ్గరే ఉండమ్మా. పాడుచదువు లేకపోతే పోయింది. నిన్ను పెండ్లి చేసుకోవాలని ఎందరో గొప్ప వంశాలవారు కబుర్లు పంపుచున్నారమ్మా" అని కమలను ఓదార్చింది.

కమలతల్లి పిచ్చిది. సాధారణంగా ఆవూళ్లో దేవాల యంలో ఉంటుంది. పిచ్చిలేనప్పుడు తల్లిదండ్రుల వద్దకు వస్తుంది. కమల తనతల్లిని చూచి, 'అమ్మా! అమ్మా!' అని

కౌగిలించుకొన్నది; దుఃఖించి తల్లిఒడిలో తలబెట్టి 'అమ్మా! నీకు, నీదేవునికి సేవచేస్తూవుంటానమ్మా! ఇంక నిన్ను వదలి పెట్టి పోను' అని ఏడ్చివేసింది. కూతురు ముఖము, చేతులు, బుజాలు, తనచేతులతో తడుముతూ, తలమీద తన చెక్కిలి ఆనించింది 'నాఖర్మ' ఈలాగుంది అని కన్నీరుపెట్టుకొన్నది.

కమలలో మార్పులురావడం అమ్మమ్మ గ్రహించింది. నెలలు తప్పడంతో 'ఇదేమి ఖర్మమే' అని నేలమీద కూలపోయింది. తండ్రిగారు అర్జంటు శెలవుతీసుకొని విమానంలో వచ్చాడు. కమల దుఃఖానికి నిరాశకు అంతం ఉండడం లేదు.

కండ్ల నీరుపెట్టుకొని, 'గోపాలానికి యిచ్చి వెంటనే వివాహంచేయించండి' అన్నది అమ్మమ్మ. కమల కళ్లెర్రబడ్డాయి. 'చేయించి చూడండి! ఏనుయ్యోగొయ్యో చూచుకుంటా' అన్నది కమల;

'అయ్యో తల్లి, అలాగనకు. అందరం మునిగిపోతామే; దుర్మార్గపుసంఘం!' కమల తలను తన కడుపులో పెట్టుకొని భోరున ఏడ్చింది అమ్మమ్మ.

'అంత బీదవానికి యివ్వడం నాకు యిష్టం లేదు, అన్నాడు తండ్రి.

'పొరుగూరిలో వైద్యుడున్నాడు. చాలామందికి సహాయం చేశాడు' అన్నాడు తాత.

'ప్రాణహాని ఉండదుగదా'' అన్నాడు తండ్రి.

'దైవసహాయం ఉండాలికదా. ఏకార్యానికైనా?' అన్నాడు తాత.

---

# వెఱ్ఱివాడు

"పాపకు నామకరణం మీరే చెయ్యాలి, తప్పక రావాలి" అని డాక్టరు సూర్యారావు ఆయనభార్య సత్యవతి గార్లు టెలిగ్రాం యిచ్చారు.

ఇది నాకు ఆశ్చర్యం వేసింది. వారి వివాహానికి నేను సహాయం చెయ్యనని నిరాకరించాను చివరకు, నాకు తెలుప కుండానే వివాహం చేసుకున్నారు. మూడు సంవత్సరాలు అయింది; నామీద ఎంతో కోపం ఉండాలి! కాని ఈ టెలిగ్రాం ఈలాగుందే! నన్నుగురించి మనసు మార్చుకొని ఉంటారు, అనుకొని బయలుదేరాను.

జట్కా దిగగానే "అలో! ప్రభాకర్! వచ్చావా?" అంటూ సూర్యారావు నన్ను లాక్కొని, "సత్యం! సత్యం! మీ నాన్న వచ్చాడు" అంటూ వంటింటి లోకి తీసుకెళ్ళి, "సత్యం! చెప్పు! మీ నాన్నకి! సుఖంగా ఉన్నామోలేదో! నీకు రికమెండు చెయ్యమని అడిగితే 'నీవుముకోపివి. సత్యం ఎన్నికష్టాల పాలౌతుందో! నేను రికమెండు చెయ్యను" అని నిర్మొఖమాటంగా చెప్పి వెళ్ళాడు. "నీవే చెప్పు, మనం సుఖంగా వున్నామో లేదో?" అన్నాడు డాక్టరు నవ్వుతూ. ఆమె చెప్ప నవసరం లేకపోయింది. వారిద్దరి చూపుల్లో,

నవ్వుల్లో మాటల్లో వారిగాఢమైన అన్యోన్య ప్రేమ విశద మయింది.

నామకరణసమయంలో "పేరు ఏమి పెట్టమంటారు?" అని అడిగితిని.

"నాన్నగారూ! మీ పేరు పెట్టండి" అని సత్యం చిరు నవ్వు నవ్వింది

"ఎందరో మహనీయులుండగా, నా పేరు పెట్టడమే! నేను ఒప్పుకోను" అని డాక్టరువైపు చూస్తిని.

"ఒరే! ప్రభాకర్! సత్యం చెప్పినట్టు చెయ్యి"అన్నాడు ఇద్దరూ పడిపడి నవ్వారు.

"ఏమిటి రహస్యం?"

"నాన్నగారూ! మీ అల్లుడుగారు అనవసరంగా కోప పడుతూ వుంటారు మీకు ఉత్తరం వ్రాస్తానని కాగితం కలం తీసుకుంటే, భయపడిపోయి, కోప్పడనని మాట యిచ్చి, లెంపకాయలు వేసుకుంటాడు తిరిగి మాట తప్పుతాడు" అన్నది సత్యం.

"దానికీ నామ కరణానికి సంబంధం ఏమిటమ్మా?"

"పాపకు మీ పేరు పెట్టితే, ఆయనకు మీరు సర్వదా జ్ఞాపకం వస్తూవుంటారు. వుత్తరాలు వ్రాస్తానని నేను బెదిరించ నవసరం వుండదు" అని నవ్వింది.

"ఒరే, సూర్యం! నామకరణం తీర్మానం చెయ్యక ముందే, నీవు చెప్పకోవలసిన దేమైనావుంటే, ఇప్పుడే చెప్పుకో!"

"సత్యం చెప్పిందంతా నిజమని నమ్మవద్దు. నా కోపం చాలా తగ్గిపోయింది. ఈ విషయం, ఇక్కడికి వచ్చిన నా స్నేహితులను, రోగులను కూడా అడుగు. అయినా నీ పేరు విన్నప్పుడంతా, నీవు నాకు సహాయం చెయ్యకపోవుటకు కారణం, జ్ఞాపకం వస్తూవుంటుంది. ఒక విధంగా మంచిదే!" అని నవ్వాడు.

రావుకూ నాకూ యిరవై యేండ్లుగా స్నేహితం. మెడికల్ కాలేజిలో చదువుచుంటిమి. హాస్టలులో ఇతనికి, డాక్టర్ న్యూసన్సు (Dr Nuisance) అని ఎగతాళి పేరుపెట్టారు. అందరికి అయిష్టమే. అందరిలో ఏదో ఒక తప్పుచూపించే వాడుక. జుట్టు పెట్టుకున్నారని, బొట్టుపెట్టుకున్నారని, జంధ్యం వేసుకున్నారని, కారంపొడి తిన్నారని, టూత్ బ్రషుతో పండ్లుతోముకోలేదని, సంధ్యవార్చారని, గ్రహణంలో నమ్మారని, వినాయకుణ్ణి పూజించారని, కట్నం పుచ్చుకొన్నారని, ప్రతి స్వల్పవిషయంలోనూ ఎవరినో ఒకరిని హేళనచేస్తూనే వుండే స్వభావం. చివరకు సిగరెట్టు చుట్ట త్రాగినా, తాంబూలం వేసుకున్నా ఆక్షేపించేవాడు. అయితే ఒకవిషయం ఇక్కడ వ్రాయకతప్పదు. ఎంత మోటుగా ప్రవర్తించినా, అతని హృదయం మంచిది. కాని, అతనిని క్షమించినవాడిని నేనొక్కడినే.

హాస్టలులో, తన గదిలోకి రెండవ విద్యార్థి లభించనే లేదు. స్నేహితులనేవారుంటేగా! నేనొక్కడినే చివరకు సాహసించాను. కాని, అతను నన్ను సతాయించేవాడు. నా పరుపును నేను ఎంత దులిపినా, వానికి తృప్తిలేదు. తాను

నా పక్కను తిరిగీ దులిపి, ఎండలో వేసి, మడిచి తెచ్చి పెట్టే వాడు. నేను గదిని తుడిచి వెళ్ళితే, తిరిగీ తాను తుడిచే వాడు. ఇతను ఒక Crack అని అనుకునేవాణ్ణి.

ప్రయివేటు ప్రాక్టీసులో, మా అందరికంటే ఎక్కువ గడిస్తుండినాడని తెలిసింది. ఒక రోజున ఒకరోగితో "అంత రేచరు ఎందుకువచ్చింది? నేను చెప్పినట్లు పత్యం చెయ్యలేదు. ఏంతిన్నావు?" అని పోలీసు కోర్టులో మాజిస్ట్రేటులాగు ప్రశ్నించాడు. "నేను బీరకాయలు తినమని చెప్పితే నీవు బంగాళాదుంపలు తిన్నావా? ఇక నీకు చికిత్స చెయ్యను" అన్నాడు. ఒక గంటసేపయిన తరువాత, అందరు రోగులను చూచిన తరువాత, ఇతనికి ఏదో చేసి పంపాడు. ఈ లోపల నేను రోగులతో మాట్లాడితిని. "గొప్ప రణవైద్యుడండి; తాను కోశాడో, నయం కావలసిందే! అందువల్ల ఆయన ఎంత కోప్పడ్డా, మేము ఆయనవద్దకు రాక తప్పదు" అన్నారు.

ఈ వెఱ్ఱి స్నేహితుని భార్యచనిపోయింది. ఇద్దరు బిడ్డలుండిరి. "చాలా కష్టాల్లో ఉన్నాను. నీసలహా సహాయాలు కావాలి" అని వ్రాశాడు. నా ప్రాణస్నేహితునికి సహాయం చేతామని వెళ్ళితిని.

"టీచరు సత్యవతిని నేను బాగా ఎరుగుదును. నీవు ఆవిడను ఈ వూరికి పంపించి రెండేళ్ళకు ఎక్కువ అయింది. నాకు తెలిసిన స్త్రీలలో చాలమంచిది. ఆమెను వివాహం చేసుకుంటే, నేను నాబిడ్డలు సుఖపడతామని నమ్మకం. నీసహాయం కావాలి" అన్నాడు.

"ఆమెకు, ఆమె విద్యార్థులకు, నీవు ఉచితంగా చికిత్స చేస్తూనేవున్నావు. మీరు ఒకరినొకరు బాగా ఎరుగుదురు. నిన్ను వివాహం చేసుకోమని నీవే నేరుగా అడగరాదా?" అంటిని.

"ఆమె సమ్మతించకపోతే! నీవు చెప్పితే కాదనదు."

"నీవు చాల కోపదారివి నీవల్ల ఎన్నికష్టాలు పడుతుందో? నాకు ధైర్యంలేదు."

"వాస్తవమే! నేను కోపదారిని. అయితే, నాహృదయం ఏలాంటిదో నీకు తెలుసు ప్రభాకర్! ఈలాంటి కష్టసమయంలో చిల్లర విషయాలు నీవు మరచిపోవాలి" అన్నాడు.

"ఆమె, నేను చెప్పినంతమాత్రాన ఎందుకు ఒప్పుకోవాలి! ఒప్పుకోమని నిర్బంధం చెయ్యడం తగునా?" అని బాధ్యతనుండి తప్పించుకోవాలని ప్రయత్నించితిని.

"ఆమెను బంధువులందరూ బహిష్కారంచేసి, తరిమివేస్తే, నీవద్దకు వచ్చిందట మరెవరూ చెయ్యలేనంత సహాయం, నీవు నీభార్య చేశారట. తల్లిదండ్రు లెవరంటే "ప్రభాకరరావు, రమ అంటుంది. నీ పేరేమంటే నీవు పెట్టిన 'సత్యవతి' అనేపేరు చెప్తుంది. స్కూలు రిజిష్టరులోకూడ ఆలాగే వ్రాసింది. మీ ఫొటోలకు పూలుకట్టి పూజిస్తుంది. మీమీదగల పూజ్యభావం అంతకంటే మరేంకావాలి?" అని సమాధానం చెప్పాడు.

"ఆమె బాల వితంతువు; తెలుసునా?"

"ఆమె వితంతువని తెలుసు."

"ఒక బిడ్డను కన్నది తెలుసునా?"

"తెలియదు"... ...కొంతసేపాలోచించి "ఆ బిడ్డను నా బిడ్డలాగు పెంచుకుంటాను"

నా మిత్రుని గొప్పతనానికి, నాకంటిలో నీరుకమ్మింది. "ఆబిడ్డ పుట్టిన నెలలోగానే చనిపోయింది" అంటిని, ఎంతో జాలిపడ్డాడు.

ఈలాంటి స్నేహితునికి సహాయం చెయ్యవలసిందే నను కొంటిని. సత్యవతిని స్కూలులో కలుసుకొంటిని ఆమె బళ్లారికివచ్చి రెండు సంవత్సరాలు అయింది. బళ్ళారికి సాగనంపే సమయంలో, రయిలు స్టేషనులో "అమ్మా; జాగ్రత్త! మర్యాద కాపాడుకో" అని చివరిసలహా యిస్తిని.

"నాన్నగారూ! పొరపాటు ఏదోచేశాను. తిరిగీ చేసే గుణం నాలోలేదు. నన్ను నమ్మరూ?" అని నా చేతులు పట్టుకొని నవ్వింది.

"నిన్ను నమ్ముతాను, సత్యం!" అంటిని. సత్యవతిని నా బిడ్డలలో ఒకతిలాగు పెంచాను. ఎంతోమంది అనాధ బాలికలను పెంచాను; కాని, సత్యవతి అందరిలోకి మంచిది. స్కూలులో కలుసుకోగానే,

"నాన్నగారూ!" అంటూ నా రెండుచేతులు పట్టుకొని చెక్కిళ్ళకు వత్తుకొన్నది.

"నీవు చాలా సంతోషంగా ఉన్నట్టుంది" అంటిని.

"అవును, నాన్నగారూ, విద్యార్థులకు నామీద ఎంతో ఇష్టం. తోడిటీచర్లు నన్ను ప్రేమించుతారు. ఇంక నాకేమి కావాలి?"

ఈవిడ ఆనందం చూచి, "ఆ Crack ను వివాహం చేసుకొంటే, ఏం కష్టపడుతుందో?" అనే ఆలోచన అకస్మాత్తుగా వచ్చింది. నా ఆలోచనను, నా ముఖంలో కనిపెట్టింది కాబోలు.

"ఏమి, నాన్నగారూ! ఆలోచనలో మునిగిపోయారు?" అని అడిగింది.

"ఏమీ లేదమ్మా! నీకేమయినా చేసి పెట్టవలసిన పనులున్నాయా? ఎంతో కాలానికి వచ్చాను... చేసిపెట్తాను."

"నాకు అన్నివిధాల తృప్తికరంగా వుంది." సెలవు పుచ్చుకొని బయటికి ఒస్తిని, నామిత్రుడు నిలబడి వుండెను.

"సమ్మతించిందా?" అని ఎంతో ఆశతో అడిగాడు.

"వివాహం విషయం నేను మాట్లాడనే లేదు" అని తల వాంచుకొంటిని, అతను నిర్ఘాంతపడిపోయ్యాడు.

నేను ట్రెయినులో తిరిగీ వెళ్ళేప్పుడూ, వారు వివాహం చేసుకొన్న తరువాత కూడా, ఒకే సంశయం నాకు కలుగుచూ ఉండేది. "నేను పొరపాటుచేశానా?" అని.

నన్ను సాగనంపుటకు నామిత్రుడు స్టేషనుకు వచ్చాడు. "నామీద కోపం పోయిందా" అంటిని.

"సత్యం నన్ను వివాహం చేసుకొన్నది. ఇక కోపం ఎందుకు?" అని నవ్వాడు.

"నీకేదో అసంతృప్తి ఉన్నట్టు నాకు తోచింది?"

"అవును. సంఘసంస్కరణాలన్నింటిని, నా జీవితంలో, పూర్తి చెయ్యలేకపోతినే"

"ఇంకా, ఏం కోరవలున్నాయి ?"

"మొదటిది సత్యం హారిజన్ అయివుంటే బాగుండేది."

"రెండవది ?"

"ఆమెబిడ్డ జీవించివుండి, ఆమె నా బిడ్డలను పెంచిన లాగున ఆమెబిడ్డను నేను పెంచివుంటే, నాకు తృప్తిగా వుండేది."

"సంఘంలో నీవుపడ్డ కష్టాలు చాలవా ?"

"ఇంకా పడగలను."

"అందుకనే నిన్ను Crack అంటారు."

"నాలాంటి Cracks మరికొందరుంటే, సంఘంలో రెండు మూడు వేల ఏండ్లుగా పేరుకపోయిన కుళ్ళంతా నాశ నంచేసి వుందుము."

ఈ వెఱ్ఱివానికి నేను తగినంతగా తోడ్పడలేదని, విచారపడితిని.



# "ఛీ! ఏమి సంఘం!"

లక్ష్మి, రోశయ్య, ఒక శిశువుతో వచ్చారు. ఎంతో సంతోషంగా వున్నారు వారిని చూడడంతోనే, నాకూ ఎంతో సంతోష మేసింది. చిరునవ్వుతో బిడ్డను నాకు యిచ్చారు. ముద్దు పెట్టుకుంటూ వుండగా, నా భార్య ఆ పాపను తీసుకొని,

"ఎంత బాగున్నాడు? పాలబుగ్గలు ఎంత మెత్తగా వున్నాయి" అంటూ ముద్దు పెట్టుకొన్నది.

"నాన్న గారూ! వీడికి పేరు పెట్టండి" అన్నది తల్లి లక్ష్మి.

"మీ ఆశీర్వాదం కొరకే వచ్చాము" అన్నాడు తండ్రి రోశయ్య.

అందరం కలిసి ఆలోచించి, చివరకు "వీరేశలింగం" అని పేరు పెట్టాము. అందరం ఆనందంతో విందారగించిన తరువాత, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ హాలులో కూర్చు న్నాము. చటుక్కున ఏదో జ్ఞాపకానికి వచ్చింది. నేను లోప లికి వెళ్ళి, చిన్న నగల పెట్టెను తీసుకవచ్చి రోశయ్య చేతిలో పెట్టాను.

"అందుకేనా వెళ్లారు. నాన్నగారూ: ఈ బంగారు కొండతో, ఇవి సమానమవుతాయా?" అని అంటూ తన బిడ్డను ముద్దాడి నవ్వింది, లక్ష్మి.

రోశయ్య పెట్టెను తెరచి, రెండు దండలను తన భార్యను పెట్టుకోమని యిచ్చాడు. వాటిని బిడ్డమెడలో వేసింది.

ఇదంతా చూస్తూవుండిన నామిత్రుడు రామారావు "మీా వితంతు సంఘం తాలూకువారేనా ?" అని ప్రశ్నించారు.

"అవును, సంవత్సరంన్నర క్రిందట వీరిద్దరికి వివాహం చేయించితిమి" అంటిని.

"అయితే నగల సంగతేమి ?"

"ఆ నగలు రోశయ్య అక్కగారెవి, పెండ్లికాలంలో మరదలికి యిచ్చింది."

"అయితే, మీా వద్ద ఎందుకు వుండినయి ?"

"పెళ్లికూతురు బీదరాలు, కర్నూలునుండి వచ్చింది. మాకందరికి కొత్తమనిషి. నగలు తీసుకొని, పారిపోతుందేమో నని, అక్కగారు యిచ్చేందుకు భయపడ్డారు. పెండ్లికాగానే, ఆ నగలను నావద్దనే వుంచింది. ఒక సంవత్సరం తరువాత-వారిద్దరూ కలసివచ్చి, ఒద్దికగా వున్నామని నాకు చెప్పితే, ఆ నగలను పెండ్లికూతురుకి యివ్వవలసిందని తీర్మానంచేశారు. ఆలాగే వచ్చారు బిడ్డతోసహా. కాబట్టి యిచ్చేశాను" అంటిని.

"ఈలాంటి సమస్య ఎందుకు రావాలి ? నాకు బోధ పడడం లేదు" అని అడిగిరి రామారావుగారు.

మా వితంతు శరణాలయానికి ఎందరో వచ్చారు. వస్తున్నారు. గాని, అందరిలోను, ఈ లక్ష్మమ్మ దీనురాలు: బీదరాలు: పల్లెటూరు పిల్ల. ఆవిడను నమ్మలేదు, పెండ్లి

కుమారుని అక్క: కాని నేనుమాత్రం ఆమె సుగుణవంతు రాలని మొదట్లోనే గుర్తించాను. తన కష్టాలు ఈలాగు చెప్పుకున్నది.

"నా తల్లిదండ్రులు బీదవాళ్ళు నాకు 10 సం॥ వయసుకే, మూడువందలు పుచ్చుకొని ఒక ముసలివానికి వివాహం చేశారు. అతను అరునెలలకే చనిపోయాడు. నా తల్లిదండ్రులు అప్పులు పూర్తిగా చెల్లించలేక పోయారు నన్ను వంటచేసి బ్రతకమని నంద్యాలకు పంపిరి 13, 14 సం॥ల వయసు వచ్చే వరకు, ఏ దిగులు లేకుండా, అన్నానికి బట్టలకు జరిగిపోతూ వుండింది. వయసు పెరిగేకొద్ది, నా కష్టాలు పెరిగాయి. మగవాళ్ళలో, మంచివాళ్ళు అరుదండి నాన్నగారు" అన్నది.

"ఇంటి యజమాని దుర్మార్గుడయితే, ఆయన భార్య నిన్ను గాపాడలేదా?" అంటిని

"కాపాడుతుందని, నేనూ అలాగే అనుకొనేదాన్ని. కాని అది పిచ్చిఊహా' యజమాని భార్యతో చెప్పితే, నన్ను వెంటనే తరిమివేసింది. తరువాత మొగుణ్ని మందలించిం దేమో నాకు తెలియదు. అలాగు నాకు మూడు యిండ్లలో జరిగిందండీ."

"అవునమ్మా! ఇతరుల యిండ్లలో వంటచేసి బ్రతికే స్త్రీలకు, వయసు కొంచెము ముదిరి వుంటేనే మంచిది.

"తిరిగీ పని లభించేసరికి, కొంతకాలం పట్టుతుంది. అంతవరకూ పస్తుండాలి. ఎక్కడపోయి అడిగినా, "నిన్నెం దుకు వాళ్ళు పంపేశారు?" అని నన్నే నిందించేవారు. నిజం చెప్పితే నౌకరి లభించదు. యజమానిమీద చెప్పకుండా పని

చెయ్యాలని ప్రయత్నించితి. నేను తప్పించుకోవాలని ఎంత ప్రయత్నించినా, ఏదో ఉపాయం చేసి, మోసపుచ్చడానికి ప్రయత్నిస్తారు. రెండు ఇండ్లలో దౌర్జన్యం చేశారు గర్భం ఏర్పడుతుందేమోనని తగని భయం. ఈలాంటి కష్టాలు పడ లేక పెండ్లి చేసికొందామని వచ్చాను. ఒక పుణ్యాత్ముడు మీ అడ్రెసు వ్రాసియిచ్చాడు" అని ఆచీటి నాకు యిచ్చింది.

"అమ్మా! నీవు దిగులు పడవద్దు. వివాహం చేయించు తాను. బీదరాలివి; కాబట్టి కొంతకాలం పట్టుతుంది. గుణవం తుడు లభించడం కష్టం."

"మొగుడు తిట్టినా, కొట్టినా, పడతాను నాన్నగారు: నా బిడ్డలకు తండ్రి వలాన అని, నేను చెప్పగలిగితే, నేను సంతోషపడతాను;"

"మొగగాడిదలవల్ల నీవు చాల బాధపడ్డావమ్మా. ఇక అలాంటి విషయాలు మరచిపో."

కొంతసేపు వుండి తిరిగీ కండ్లనీరు పెట్టుకొన్నది. నాకు ఆశ్చర్యం వేసింది. "ఎందుకమ్మా ఏడుస్తావు?" అని అడిగితిని.

"నెలనెలకూ, అయిదారు రూపాయలు మా తల్లి దండ్రులకు పంపుతూ వుంటిని, ఇక పంపలేను, వారికి గంజి కైనా పంపలేను. అని దుఃఖము వచ్చింది. నాన్నగారూ" అన్నది.

ఈలాంటి అనాథల దుఃఖాలు తలచుకొని, నేనూ కొంతసేపు వ్యసన పడితిని. దుఃఖాలు లేని మానవ సంఘము ఏర్పడితే ఎంత బాగుండును?" అని అనుకొంటిని.

కొంతకాలానికి లక్ష్మమ్మను వివాహం చేసికొనుటకు కొందరు వచ్చిరి. ముఖ్యంగా వయసు ముదిరినవారు, భార్యలు చనిపోయినవారూ, భార్యలుండి నా బిడ్డలులేనివారూ వివాహమాడుటకు యిష్టపడిరి. కాని, నాకు గాని, ఆమెకు గాని అలాంటివారు నచ్చలేదు.

చివరకు ఒక యువకుడు వచ్చాడు. అయితే చాలా బీదవాడు. భార్యాభర్తలు యిద్దరూ కష్టపడి పనిచేసుకుంటే జీవితం గడుపవచ్చు ఆయువకుడు గుణవంతుడని నా మిత్రుడు రికమెండు చేస్తూ వుత్తరం వ్రాశాడు. అందువల్ల వారిద్దరూ సంప్రదించుకొని తీర్మానించుకోమని సలహా యిస్తిని, రెండు రోజులు ఆలోచించుకొన్నారు. వివాహం చేసుకొనుటకు సమ్మతించిరి.

"మీ పోషణకు ఏలాగు?" అని ప్రశ్నించితిని. "గేదలు పెట్టుకొని, పాలను కాఫీ హోటళ్ళకు అమ్మి జీవించగలము" అని చెప్పిరి.

అయితే మా సంఘపు కమిటీవారు ఈ వివాహానికి సమ్మతించలేదు. "వరుడు చాల బీదవాడు. నగలు ఎంత మాత్రమూ పెట్టలేడు. కొంతకాలానికి ఆవిడను తరిమివేస్తే, ఆమె గతి ఏలాగు" అని వారి ఆక్షేపణ.

అంతట, వరుని అక్క ఒక వితంతువు. తన రు 500 నగలు యిస్తానని ఒప్పుకొన్నది. కాని వివాహ సమయంలో "లక్ష్మమ్మ నగలతో పారిపోతే ఏలాగు?" అని అడ్డువేసింది. వివాహం చేయించాము. నగలను నావద్దపెట్టి వెళ్ళిరి.

ఈ విషయాలన్నీ రామారావు విని "మన సంఘంలో ఎంత కుళ్లు వున్నదండీ! అన్నారు. బీదలకు ఉండే దుఃఖాలలో, మనకు సహస్రాంశ లేవాండి" అంటిని.



# ఉరికంబము

ఉన్నతవిద్య నభ్యసించేందుకు నేను 1912 లో అమెరికా వెళ్ళాను. అక్కడ కాలిఫోర్నియ విశ్వవిద్యాలయంలో చేరాను. ఆ సమయంలో అక్కడ దాదాపు 30 మంది భారతీయ విద్యార్థులు విద్య నభ్యసిస్తున్నారు. విదేశీ బానిస శృంఖలాల నుండి భారతదేశ విముక్తిని సాధించడం ఎలా అన్న సమస్యపై మేము తీవ్రంగా చర్చిస్తూ వుండేవాళ్ళం. భారతదేశ విముక్తిని సాధించాలంటే విప్లవపార్టీ (రివల్యూషనరీ) నొకదాన్ని స్థాపించవల్సిందేనని బెంగాల్ టెర్రరిస్టు నాయకుడు శ్రీ లహారీ సూచించారు. 1857 ప్రథమభారత స్వాతంత్ర్య సంగ్రామం స్మృత్యర్థం విప్లవ పార్టీకి "గదర్ పార్టీ" అని నామకరణం చేద్దామని లహారీ సూచించారు. ప్రఖ్యాత భారతీయ విప్లవ యోధుడు శ్రీ హరిదయాళ్ కి ఈ సూచన బాగానచ్చింది. దానితో లహారీ గదర్ పార్టీనినిర్మించాడు. హిందీలో 'గదర్' అన్న పదానికి అర్థం – ఒక ప్రభుత్వ వ్యవస్థను ప్రజలు, సైన్యమూ కలిసి సాయుధ తిరుగుబాటుతో కూలద్రోయడమే. గదర్ పార్టీలో నేనుకూడా

చేరాను. అమెరికా, కెనడా దేశాల్లోవున్న అనేకమంది భారతీయులు ఈకొత్త పార్టీలో సభ్యత్వ స్వీకరించారు. 1914 లో ప్రథమ ప్రపంచయుద్ధం వచ్చింది. ఈ సమయంలో భారత దేశానికి వెళ్ళి తమ విప్లవ కార్యక్రమాన్ని కొనసాగించడానికే గదర పార్టీ సభ్యులంతా నిశ్చయించుకున్నారు. అలాగే అనుకున్న ప్రకారం చాలమంది సభ్యులు భారతదేశంవచ్చి సైన్యంలో చేరారు. మా విప్లవ కార్యకలాపాలు భారత సైనికుల్లో దేశభక్తిని రగుల్కొల్పాయి. ఫలితంగా భారత సైన్యంలోని కొన్ని రెజిమెంట్లుమాత్రం సామ్రాజ్యవాద ప్రభుత్వంపై తిరుగుబాటు చేశాయి. ఇదేవిధమైన కార్యక్రమాన్ని చేపట్టడానికి దేశంలో అనేకమంది సిద్ధంగా వున్నారు అయితే ఈ ప్రమాదాన్ని అరికట్టేందుకై, పరాయి ప్రభుత్వం తిరుగుబాటు సూచనలు కానవస్తున్న రెజిమెంట్లను మాత్రం సైప్రస్, వర్దకుల ప్రాణాలను బలియిచ్చేందుకు ఫ్రాన్స్ దేశానికి తరలించింది. లాహోర్, మాండలే, సింగపూర్ మొదలైనచోట్ల గదర్ పార్టీ సభ్యులందరిపైన 'కుట్ర' కేసుల్ని బనాయించింది. ఇంతటితో ఆగక అనేకమందిని అండమాన్ దీవులకుపంపి ద్వీపాంతరవాస శిక్షకూడా విధించింది. ఆవిధంగా లాహోర్ కుట్రకేసులో చిక్కుకున్న అనేకమంది గదర్ పార్టీ నాయకుల బెడదను ఈవిధంగా బ్రిటిష్ ప్రభుత్వం వదలించుకుంది.

సయామ్‌ను కేంద్రంగా చేసుకొని బర్మాలో ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి కుట్ర పన్నుతున్నామని నామీద మరి కొందరు గదర్‌పార్టీ సభ్యులమీద ప్రభుత్వం కేసులుపెట్టింది.

వాస్తవానికి కేసులు బనాయింపబడ్డ మా తొమ్మిది మందిలో ఏ ఒక్కరుకూడా బర్మా ప్రభుత్వాన్ని పడద్రోయడానికి యత్నించి యుండలేదు. నేను ప్రధాన నిర్వాకుల్లో ఒకడిని. శ్రీ భాయీ బల్వంతసింగ్ మా నాయకుడు మేం తొమ్మండుగురం బాంకాక్ (సయామ్) వద్ద సీమదేశంకు బోయేముందు-శ్రీ అమర్‌సింగ్; సివదయాళాలు బర్మాలోని భారత రెజిమెంట్లతో సంబంధాలేర్పర్చుకుని సకాలంలో తమను కల్సుకునే విధంగా ఏర్పాట్లు చేశారు. 'తా నొకటి తలస్తే దైవమొకటి తలుస్తుందన్నట్లు మా అంచనాలన్నీ తలక్రిందులైనాయి. మీదుమిక్కిలి అంతర్జాతీయ న్యాయసూత్రాలకే విరుద్ధంగా సయామ్ ప్రభుత్వం మా తొమ్మండుగురిని అరెస్టుచేసి సింగపూర్‌లోని బ్రిటిష్ సైనిక ప్రభుత్వానికి ఒప్పచెప్పింది !

నేనూ, భాయీ బల్వంతసింగ్ మొట్టమొదట నుండీ గదర్‌పార్టీలోనే పనిచేస్తూ వచ్చాం. కెనడాలోని వాంకర్ వద్ద శ్రీ బల్వంతసింగ్ ప్రసిద్ధ శిక్కు మతగురువుగా వుండేవారు. ఆ దేశంలోని లక్షలాది భారతీయులు కార్మికులు మధ్య ఈయన గదర్‌పార్టీ నిర్మాణాన్ని కొనసాగించాడు. నేను శాన్‌ఫ్రాన్సిస్కోలోని గదర్‌పార్టీ కేంద్ర కార్యాలయంలో పనిచేశాను. మా నాయకుడు భాయీజీ అంటే నాకెంత అమితమైన ప్రేమానురాగాలు. ఆయనతో నేను బాంకాక్ లోని అంతర్జాతీయ ఖైదులోను, సింగపూర్‌లోని సైనిక డిటెన్షన్ కేంద్రాల్లోను; కలకత్తా, లాహోర్‌లోని సెంట్రల్ జైళ్ళలోను రెండు సంవత్సరాలపాటు గడిపాను. జీవితంపట్ల ఆయనకున్న తాత్వికచింతన, ఆధ్యాత్మిక ఔన్నత్యం; దేశ

స్వాతంత్ర్యంకోసం అసువుల నర్పించడానికైనా సిద్ధపడే ఆయన దేశభక్తి నాకెప్పుడూ స్మరణకు వస్తూనేవుంటాయి, 1916-17 సంవత్సరాలలో మేమిద్దరమూ సింగపూర్‌లోని మిలిటరీ కస్టడీలో వున్నప్పుడు, సైనిక న్యాయస్థానం వారు మమ్మల్ని కాల్చి చంపవల్సిందిగా తీర్పునిచ్చారు. ముందు తనను చంపవల్సిందిగా భాయీ బల్వంతసింగ్ ముందు కొచ్చాడు. వాస్తవానికిది నమ్మిన సైనిక న్యాయస్థానం కాదని మా కప్పట్లో తెలియదు మమ్మల్ని చిత్రహింసల పాల్జేసి, విసిగి వేసారి తుదకు అప్రూవర్‌లుగా మారిపోతా మనే న్యాయస్థానంవారు భావించారు. అందుచేతనే మమ్మల్ని జడిపించేందుకని, మాపైకి ఖాళీతుపాకుల్ని ఎక్కు పెట్టి పేల్చ డం మాత్రమే అప్పట్లో సైనిక న్యాయస్థానంవారు చేసింది! నాటినుండి భాయిజీ నాకు వీరారాధకుడయ్యాడు. ఎటువంటి బాధను వ్యక్తం చేయకుండా, ఎట్టి ఫిర్యాదు చేయకుండా నాలో నేనే బాధల్ని అణచి మణచి వుంచుకోడం చూచి భాయీజీ నేనంటే ఎంతగానో ప్రేమించేవాడు.

తర్వాత 1917-18 సంవత్సరాల్లో రెండవ లాహోర్ కుట్ర కేసు నొకదాన్ని ప్రభుత్వాల సృష్టించింది. ఈ పథకంలో మాలో 20 మందిపై కేసులు బనాయించారు. భాయీ బల్వంతసింగ్‌పై అనేక కేసులు ప్రారంభించినట్లు విచారణ సందర్భంలో వెల్లడైంది. బల్వంత్ సింగ్‌ని ఉరి తీస్తారని వాడు కగా వుంది. నాకు సంబంధించినంతవరకు, నాకు వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చినవాడు ఒకడేఒక డున్నాడు అతడే శ్రీ జోద్ సింగ్. కేసు విచారణ సందర్భంలో ఇతను అప్రూవరుగా

మారిపోయాడు. అతడు చెప్పిన బలమైన సాక్ష్యంవల్ల నాపై ఉరిశిక్ష విధించారు కాని, "నేను చేసిన "కుట్ర"కు ఆయన బాధ్యుడు కాడని "బల్వంతసింగ్ ఒక ప్రకటనలో తెలియ జేశారు. దీనితో నాకు ఉరి త్రాడు మోక్షం తప్పింది! అయితే ఈ ఘటనల్ని చూస్తే నాకాశ్చర్యం కల్గింది. మీారటువంటి ప్రకటన ఎందుకు చేశారని భాయిజీని అడిగాను. దానికి సింగ్ యిలా సమాధానమిచ్చారు: "గత రెండు సంవత్సరాలనుండి అనేక జైళ్ళలో నీ ప్రవర్తనను నేను కనిపెడుతూనే వున్నాను. నీ జీవితం రక్షించబడిందంటే దేశానికి నీవు సేవ చేస్తావనే నమ్మకం నాకు కలిగింది. యిందులో నేను నాకై చేసిన త్యాగం ఏమీ లేదు. ఏదైనా, నేను ఉరికంబా నెక్కబోతు న్నాను. "కుట్ర"కి నేనే కారకుడనని ఒప్పుకున్నా యింత కన్నా నాకేమి పెద్దశిక్ష విధించలేరుగదా!"

ఈ పరిస్థితుల్లో, కోర్టువారు నన్ను విడిచిపెట్టారని సంతోషించే సమయంకాదిది. భాయీజీకి మరణశిక్ష విధించ డంతో కలత చెందిన నామనస్సు మనస్సులో లేదు. నాలో ఒకవిధమైన వేదనపుట్టింది. విదేశీ విచ్చు కత్తులబారినుండి దేశవిముక్తికోసం దేశభక్తిని ప్రదర్శించిన పాపానికా- భారత మాత సుపుత్రుని పరాయిప్రభుత్వం పొట్టన పెట్టుకో సంక ల్పించింది!

భాయిజీని ఉరితీశారు. పిమ్మట గురుతరమైన మహత్తర కార్యభారాన్ని నేనే వహించాల్సి వచ్చింది నాకు నిలువెల్లా కంపించిపోతుంది; స్వేచ్ఛాస్వాతంత్ర్య జ్యోతిని చేపట్టి భాయిజీ మహోన్నత ధైర్యసాహసాల్ని జ్ఞప్తి చేసుకుని ధైర్యం తెచ్చు

కున్నాను. అలా ఆలోచనా సముద్రంలో తలమున్కలై కొంతసేపు ప్రశాంతంగా వున్నాను.

భాయిజీ శక్తిసామర్థ్యాలు నా మనోఫలకంపై పెన వేసుకున్నాయి. నా దేశాన్ని, దేశ పరిస్థితుల్ని ఒక్కసారి సింహావలోకనం చేసుకున్నాను. దేశం ఎదుర్కొంటున్న మత, సామాజిక రాజకీయార్థిక సమస్య లెన్నింటినో పరిష్కరించాలంటే నాబోటి సామాన్యుడికి శక్తికి మించిన పనిగా తోచింది. ఎంచేతనంటే, శతబ్దాల తరబడి ఈ సమస్యలు అప రిష్కృతంగానేవుండిపోయి పెద్దరుగ్మతలుగా తయారైనాయి.

అలా కొంతకాలం, ఎటూతోచక ఖంగారుపడి అజాగ్రత్తగా మెలిగాను. ఆ తర్వాత నాలోవున్న యువజనోత్సాహంతో కార్యరంగంలోకి దుమికాను. కోర్టువారు నాకు మరణశిక్షనురద్దుచేసినా జైల్లోమాత్రం నిర్బంధించేవుంచారు. ప్రథమ ప్రపంచయుద్ధం ముగిసేవరకు నన్ను జైల్లోనే నిర్బంధించవల్సిందిగా ప్రభుత్వాజ్ఞలు రావడంతో నన్ను లాహోర్ జైలునుండి కన్ననూర్ సెంట్రల్ జైలుకు మార్చారు. కన్ననూర్ జైలు నిర్వహణ మరింత అధ్వాన్నంగా వుండడంతో పాటు అక్కడ లంచగొండితనం బహు జాస్తీగా వుండేది. ఆ జైల్లోని వేయిమంది నిర్బంధితులకు జైలు నిబంధనలప్రకారం ఆహారంగాని, బట్టలు, వైద్యసౌకర్యం గాని మృగ్యం. ప్రతి సంవత్సరం జైళ్ళపరిశీలనకు వస్తూవుండే జైళ్ళశాఖాధికారికి ఈవిషయమై ఫిర్యాదుచేశాను. అధికారి పని ముగించుకొని అటు ముడ్డి మలిపాడో లేదో- జైలు అధికారులంతా ఏకమై నన్ను బాదారు; ఒంటరివాడ్నిగ చేసి నన్నువారు ప్రత్యేక

సెల్లులో నిర్భంబంధించారు. అంతకు అంతదెబ్బ తీయలేక పోతానా అనుకున్నాను. ఒకరోజున ఆ అవకాశం రానే వచ్చింది! అప్పట్లో జైలర్‌గా వున్న (శ్రీ) గురునాధయ్యను ఒక రోజున ఎంతగా బాదానంటే - ఆ దెబ్బతో ఆయన తదితర జైలు అధికారులు తమజీవితంలో నన్ను మర్చిపోలేదు!! అయితే వాళ్ళుకూడా తిరిగి నన్ను తీవ్రంగా బాదారు. నన్ను వివస్త్రుడ్ని చేశారు. మూడు రోజులపాటు నా ముఖాన పిండా కూడుకూడా వేయకుండా ఉపోషం వుంచారు. చెప్పరాని బాధలకు నన్ను గురిచేశారు. అయినా యింతమాత్రానికే నేనేమి చలించలేదు. మరింత ధైర్యం తెచ్చుకున్నాను. ఎన్ని బాధలనైనా ఓర్చుకునే విధంగా నైతికస్థాయిని పెంపొందించుకున్నాను. శారీరక బాధ నాకేమంత లెక్కలోదికాదు. ఆ విధంగా రోజురోజుకి నాకు ధైర్యసాహసాలు ఎక్కువైనాయి.

మరోవైపున, జైలు అధికారులకి ధైర్యం సన్నగిల్లిపోయింది. నాదగ్గరకు రావడానికే వారికి భయం భయంగా వుండేది అక్కడినుండి వారు నాకు సుచికరమైన భోజనం పెట్టడం మొదలెట్టారు. అలాగే తమ నిత్య పరిపాలనా విధానాన్నికూడా కొంత సంస్కరించుకున్నారు. కాని కొద్దిరోజుల్లోనే వారు నన్ను కోయంబత్తూర్ సెంట్రల్ జైలుకి బదిలీ చేశారు. జైలర్ గురునాధయ్యను కొట్టానన్న వార్తను కోయంబత్తూరు జైలుకు మారకముందే అక్కడివారికి తెలిసిపోయింది. నేనీ జైలుకి మారిన 24 గంటలలోనే జైలర్ మెకర్రీస్ నన్ను తన ఆఫీసుకి పిలిపించాడు. నన్ను యిష్టమొచ్చినట్లు తూలనాడాడు. అబ్బాయి నన్ను నీవు నిష్కారణంగా

తూ లనాడుతున్నావ్, నా సంగతేమిటో నీ కింకా తెలియదు. అని నేనే మెకర్నితో చెప్పాను.

చేసిన తప్పుకు క్షమాపణ చెప్పుకుంటావా, లేదా భరతం పడతానని మెకర్నిని హెచ్చరించాను. పరిస్థితులిలా మారుతాయనుకోలే దతను. ఈ నానిశ్చయానికి ఆశ్చర్య పోయాడు, భయపడిపోయాడు; గజగజ వణకిపోయాడను కోండి నన్ను చూచి. చివరకు తన ప్రక్కన అంగరక్షకుడు (Body guard) వున్నాడనికూడా మెకర్నికి తోచ లేదు. ఇప్పటికి అతనికి కాస్త జ్ఞానోదయం కలిగింది క్షమించమని వేడుకున్నాడు. ఆతర్వాత సత్ప్రవర్తనతో మెలగడం నేర్చు కున్నాడు. అతని నైతిక పిరికితనానికి నాకు నవ్వొచ్చింది. ఇటువంటివి, యిలాంటి మరికొన్ని అనుభవాలు నాకు రెండు విషయాల్ని బోధించాయి.

1. ఏవ్యక్తి అయినాసరే తను నైతికంగా బలంగా వుంటూ తన వ్యతిరేకిని నైతికంగానే ఓడించొచ్చు. వ్యతిరేకి భౌతికంగా ఎంతబలవంతుడైనా సరే.

2. ఒక మహత్తర ఆశయంకోసం చావుకైనా సిద్ధపడ్డ వాడు, అలా సిద్ధపడనివాడికన్న శతవిధాల బలవంతుడు.

1919 లో నేను జైలునుండి విడుదలయ్యాను. బయ టికి వచ్చేసరికి అనేక కొత్తసమస్యలు ముప్పిర గొన్నాయి. నేను పేదవాణ్ని. పూటకి ఠికాణా లేదు. మరి ఏదో సంపాదనకు పూనుకోవాలిగదా! అందులోను ప్రభుత్వ "శత్రువులైన" నా బోంట్లకు ఇది మరీకష్టం. ప్రజాసేవ చేయాలంటే దేశంలో నిర్వర్తించాల్సిన పనులు కొల్లలు. మన నాగరిక జీవనంలో

అదొక పరిణామ దశ. శతాబ్దాల తరబడి మనల్ని పీల్చి పిప్పి చేసిన సామాజిక, మతసాంప్రదాయాలకు కాలదోషం పట్టు తున్న రోజులవి. పుట్టుకతోనే ఏర్పడిందన్న వర్ణాశ్రమ ధర్మా నికి వ్యక్తుల శక్తిసామర్థ్యాలు, గుణగణాలమీదనే ఆధారపడ్డ ఆధునిక సామాజిక భావాలకు మధ్య సంఘర్షణ తలెత్తిన రోజులవి. బాల్యవివాహాలు, నిర్బంధ వైధవ్యం, ఆనుషంగి కంగా వస్తున్న వేశ్యాలంపటత్వం, అస్పృశ్యత, యిలాంటి సమాజ్య రుగ్మతలే మరికొన్ని చైతన్యంగల ఆధునిక మానసిని యిట్టే పట్టి కొట్టించడానికి ఇవిచాలు. విదేశీ పాలన, ప్రజల బీదతనం - ఈ రుగ్మతల్ని తక్షణం నిర్మూలించాల్సిన ఆవ శ్యకతను లోపింపజేశాయి. ఇటువంటప్పుడు లక్షలాది దేశభక్తులకు, సంస్కర్తలకు చేతినిండా కావలసినంత పని. నేనీ మహత్తర కార్యానికే పూనుకొన్నాను.

కాని ఆ సమయంలో గాంధీమహాత్ముడు ప్రబోధించిన నైతిక, ఆధ్యాత్మికశక్తులే - 35 కోట్ల భారతీయులను శతా బ్దాల దురాచారాలనుండి, దుస్సాంప్రదాయాలనుండి విముక్తి గావడానికి తోడ్పడ్డాయి. ఆవిధంగా గాంధీజీ ఆధునిక సమా జానికి పునాదులు వేశారు. యువకులు ఉవ్వెత్తున కార్యాచర ణకు దుకారు. వారితో కలసి పనిచేసే అదృష్టమూ సంఘ 'సంస్కరణా కార్యక్రమంలో వారికి నాయకత్వంవహించే అదృ ష్టమూ నాకు కలిగాయి. ఈ సమయంలో మేము అభివృద్ధి నిరోధకమైన మా పెద్దవాళ్ళను ఎదిరించాం. వాళ్ళు మడి గట్టుకు కూర్చున్న "పవిత్ర ఆచార సాంప్రదాయాలకు" తూట్లుపొడిచాం. ఆ విధంగా మేము గొనివచ్చింది అహింసా

పూర్వకమైన సామాజిక విప్లవమేూదు, తుదకు విదేశీపాలనే దేశంనుండి తరుమగొట్టాం. మన దేశానికి సోషలిస్టు రాజ్యాంగా నొకదాన్ని రూపొందిద్దామని కూడా మేము తీవ్ర ప్రయత్నాలు చేశాం. కాని మా ప్రయత్నం విఫలమైంది. ఈ గొప్ప గొప్ప సాంఘిక పరిణామాల ఫలితంగా నేను కొంతకాలం సమాజబహిష్కృతుణ్ణి కావలసివచ్చింది. ఇటువంటి క్లిష్టపరిస్థితుల్లోనే నాకు పలుసార్లు జైలుశిక్ష విధించారు. జైలు జీవితంకన్న సంఘంనుండి బహిష్కరింపబడ్డ మాటూనే ఎంతో ఘోరమైన శిక్షఅనేది నా జీవితానుభవం. విదేశీపాలననుండి దేశ రాజకీయ స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న వ్యక్తి ఎవరైనాసరే - అతనితట్ల తన దేశప్రజలకు ఎంతో గౌరవాభిమానాలుంటాయి. ఇటు సమాజ బహిష్కృతుడి విషయమో! దానికి గురైనవాడ్ని తన సమాజసభ్యులే చిన్నచూపు చూస్తారు. అసహ్యించుకుంటారు. తిరిగి ఈ 'పెద్ద మనుషుల' విషయం చూస్తే - వీరంతా మార్పులేని సాంప్రదాయ జీవనవిధానాలకు బానిసలు, దాసులు.

నాకూ వృద్ధాప్యం వచ్చింది. కాని గత అర్థ శతాబ్దకాలంలోను దేశగతిని మార్చిన అనేక మహత్తర ప్రజోద్యమాలలో నేను గట్టిపాత్రే వహించినందుకు యిప్పటికీ నాకు ఆనందంతోపాటు గర్వము కలుగుతూంది. భాయీ బల్వంత సింగ్ అనేక ఉదహరణలద్వారా నాలో రేకెత్తించిన మానసిక ఔన్నత్యం, నాలోని అచంచల విశ్వాసం నన్ను మానవుణ్నిగా చేశాయి. నాటినుండి ఆర్గనైజు చేయడం, ప్రజలకి నాయకత్వం వహించే స్తోమత నాలో బాగా పెంపొందాయి. నా వ్యక్తిత్వం మూడు పూవులు ఆరు కాయలుగా పరిఢవిల్లజొచ్చింది.

---

# మళ్ళీ పెళ్ళి

ఏలూరులో మాణిక్యాలరావు అనే మిత్రుడొక డున్నాడు. ఆయన, నేను కష్టకాలంలో సన్నిహిత మిత్రుల మయ్యాం. మా యిద్దర్ని అరెస్టుచేసి నిరవధికంగా జైలు శిక్ష విధించారు. ఇంతకూ ఎట్టి విచారణగాని, నేరారోపణ గాని లేకుండానే ఈ అరెస్టు జరిగింది. లక్షలాది తదితర దేశ భక్తులకువలెనే మేమిద్దరమూ కూడా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నాం.

మిత్రుడు రావు నాకంటె చిన్నవాడు. నేను పెద్దవాణ్ణి రావు ఎంతో ప్రేమతో నన్ను 'తాత' అంటూ పిలిచేవాడు. రావు బాగా డబ్బుసంపాదిస్తున్న వ్యాపారి! ఈయన భార్య అతనికి ఎప్పుడూ బుట్టలు బుట్టలు మామిడిపళ్ళు పంపుతూ వుండేది. వాటిల్లో ఒక మంచిపండు ఏరి మరీ నాకిచ్చేవాడు రావు.

రావుభార్య అనుకోకుండానే మశూచివచ్చి చచ్చిపో యింది. అప్పటికి భర్త జైల్లో వున్నాడు. ఆయనస్థితే ఇలా వుంటే ఇంకాయన భార్యకుచేయగల్గిం దేముంది? ఏమీ సాయపడకపోయినందుకు ఎంతో కుమిలిపోయాడు రావు. తనభార్యకు ఎంతగా అక్షరజ్ఞానం లేకపోయినా ఎంత నిష్ఠగల సంఘసేవకురాలుగా తయారైందో మిత్రుడు నాతో చెప్పాడు.

ఒకవైపున గాంధీజీ ఉద్యమాల ప్రభావం, మరోవైపున భర్త వ్యక్తిగత ప్రోత్సాహం-ఆమె జీవితంపై గొప్ప ప్రభావాన్ని కలిగించాయి.

అనేక నెలలు గడచిపోయాయి. రావూ, నేను జైలు నుండి విడుదలయ్యాం. మిత్రుడి వ్యాపారం అభివృద్ధి చెందింది. చైతన్యం గల్గిన తెలివిగల భార్య కావలసివచ్చింది మిత్రుడికి. మన సమాజానికి ఎవడి జీవితాన్ని వాడు నిర్ణయించుకోవడం అనేది యింకా అబ్బలేదు ప్రేమించి చేసుకోవడం అపవిత్రంగా వుండేది (ఇప్పటికి అంతే.) వధువుని సెలక్టు చేసే బాధ్యత తల్లిదండ్రులు, స్నేహితులు వహించారు. రావు పరిస్థితికూడా ఇంతే. తనకు వచ్చిన సంబంధాల్లో ఎవర్ని ఎన్నుకోవాలో మిత్రుడికి కష్టమైపోయింది.

ఈ లోగానే ఒక యువతివచ్చి "మిమ్మల్నే చేసుకుంటానని" రావుదగ్గరికి వచ్చింది. రావుకి ఆశ్చర్యం వేసింది. తనకేమో ఈమెవరో తెలియదు. కొత్తమనిషి. ఆమెను గౌరవించి వినయపూర్వకంగా పలుకరించాడు. "నన్నే చేసుకోవాలని ఎందుకనుకున్నావు" అని ప్రశ్నించాడు. ఆయనకున్న పేరుప్రతిష్ఠల వల్లనే తను తెలుసుకోగల్గానని ఆ యువతి సమాధాన మిచ్చింది. ఈమెకు రావుగారి కాలంచేసిన భార్య కూడా తెలుసు. ఈయన చేయూతతో ఆమె ఎలా చక్కటి సంఘసేవకురాలుగా మారిందో తెలుసు. తానూ సాంఘిక అన్యాయాలకు ఎరఅయిన దానినేనని, ఈ సందర్భంలో తన్ని రక్షించి నూతన జీవితాన్ని ప్రసాదింపగల్గింది తామొక్కరేనని కూడా ఈ యువతి రావుకి చెప్పుకుంది.

రావు యువతి కలుపుగోలు తనాన్ని, జోళాతనాన్ని ధైర్యాన్ని మెచ్చుకొన్నాడు. తన కష్టాలేవిటో చెప్పమని ఆ యువతిని ప్రశ్నించాడు. యువతి ఈ విధంగా సమాధానం చెప్పింది. "నాకు 8 సంవత్సరాలన్నా నిండకుండానే మా వాళ్ళు వివాహం చేశారు. నా భర్త వయస్సు అప్పటికి 12 సంవత్సరాలే! అప్పటికే ఆయనకు 9 సంవత్సరాల 'సతీమణి' వుంది. ఈవిషయంలో నాతల్లిదండ్రులు నా కెంతో అన్యాయం చేశారు. నాకూ, నా సవతికి వయస్సు వచ్చింది. ఇద్దరమూ భర్తతో కాపురం చేశాం. భర్తగారి మొదటి భార్యకు యిద్దరు పిల్లలు కలిగారు, నాకు మాత్రం పిల్లలులేరు. గ్రామ రాజకీయాల్లో కొట్టుకుచస్తున్న రెండు వర్గాల్లో ఒక వర్గానికి చెందినవాడు నాభర్త. ఎంతసేపటికి కొట్లాటల్లో, పోట్లాటల్లో లిటిగేషన్, క్రిమినల్ కోర్టు వ్యవహారాల్లోనే నా భర్త మునిగి తేలుతుండేవాడు. తానేదన్నా సాధించాలనుకుంటూ ఎంతటి హింసాచర్యలైనా ఒడిగట్టేవాడు. ఇటువంటి జీవితాన్ని చూసి నాకు రోత పుట్టింది. ఇంక గతిలేక నన్ను పెంచి పెద్ద చేసిన మేనత్తదగ్గరకు చేరుకున్నాను. ఆయన్ని విడిచిపెట్టే శాను మొదటినుండీ మీ దేశభక్తంటేను, సంఘసేవంటేను నేనెంతో మెచ్చుకుంటూ వుండేదాన్ని. మీ బాధలు, మీ త్యాగం నేనెరుగుదును. ఈ క్లిష్ట సమయంలో నన్ను ఆదుకో గలిగింది, పెళ్ళాడగలిగింది, మీరొక్కరే ననుకున్నాను. అందుచేతనే మీవద్దకు చేరాను. ఈ సందర్భంలో నేను ప్రజాభిప్రాయాన్ని ఖాతరు చేయడంలేదన్న సంగతి మీరు గుర్తుంచుకోండి. లోకులు కాకులనుకున్నాను.

ఆ యువతి వ్యక్తిత్వం, ధైర్యం, కలుపుగోలుతనం మిత్రుడు రావ్‌కు బాగా నచ్చాయి. ఈ విషయమై ఆలోచించడానికి కొద్ది వ్యవధినివ్వమని ఆమెను అడిగాడు. మిత్రుడు నా సలహా అడిగాడు. తప్పకుండా ఆమెనువివాహం చేసుకోమని నేను హృదయంపూర్వకంగా చెప్పాను. ఉభయులు వివాహం చేసుకోడానికి నిర్ణయించుకున్నారు. అయితే వివాహం ఎప్పుడు జరగాలన్న విషయమై యిదమిత్థంగా తేలలేదు. ముందు ఆ యువతికి మొదటి భర్తకు విడాకులిచ్చే అవకాశాన్ని కల్పించాలని మిత్రుడు రావు సూచించాడు. విడాకులంటే అంత తేలిగ్గా పరిష్కారమయ్యే సమస్యగాదు. ఇందుకు కనీసం ఆరునెలల వ్యవధన్నా కావాలికదా. ఇప్పటికే తమమీద లోకులంతా నానా అపవాదులు వేస్తున్నారుకదా అని ఆయువతి చెప్పింది. "ఒకరినొకరు కలుసుకోకుండా ఆరు నెలలు ఏవిధంగా వుండగలం!" అని యువతి అభిప్రాయ పడింది. అంచేత వివాహం ఆలస్యం చేయకూడదని ఆమె సూచించింది. శుభస్య శీఘ్రం అన్నది. కాబోయే భార్యాభర్తలిద్దరూ తుదినిర్ణయం చేయడానికని మా దంపతులిద్దరి వద్దకు వచ్చారు. ఈ సమస్య మాకంత తేలికైన పనికాదు. మా లీగల్ సలహాదార్ల అభిప్రాయాన్ని అడిగాం. భర్త బ్రతికివుండగానే మరొకడ్ని పరిగ్రహించడమనేది క్రిమినల్ చర్యక్రిందకు వస్తుందని వారు హెచ్చరించారు. ఆ యువతి మొదటి భర్తగనుక నూతన దంపతులమీద అభియోగం తెచ్చాడంటే వీరుభయులు 6 నెలలపాటు జైలుశిక్షలు అనుభవించాల్సి వస్తుంది. అంటే నూతన వివాహం రద్దయే

ప్రమాద మున్నదన్నమాట! ఆ యువతి వెలిబుచ్చిన అభి ప్రాయంతో నేను, నా భార్యా అంగీకరించాం తనున్న పట్టణ మంతా, ఎవరో లేపుకుపోయిందని యిప్పటికే గగ్గోలుగా వుంది గనుక తక్షణం వివాహం జరిగేవరకు తిరిగి పట్టణానికి రాకూడదనే మేం నిర్ణయించాం.

అంతగా జైలు శిక్షే తప్పకపోతే అందుకూ సిద్ధంగానే వున్నా నని ఆ యువతి చెప్పింది. రావు సందేహించాడు. నేను మిత్రుడిన్ని అడిగాను: కేవలం వివాహం చేసుకుని స్థిర పడి పోదామనే నీ అభిప్రాయమా? లేక ఇటువంటి అనాథ స్త్రీలకేమన్నా సాయం చేద్దామనే మహోద్దేశం వుందా?" అని. అనాథ స్త్రీలకు సాయం చేయడమే తన విధి అని రావు చెప్పాడు. అటువంటప్పుడు "యిద్దరు తక్షణం వివాహం చేసుకోండి. ఆ విధంగా బాల్యవివాహం, బహు భార్యా త్వాన్ని అంగీకరించే సాంఘిక దురాచారాలను ఎదిరించి నిల వండి" అని సలహా యిచ్చాను. ఈ వివాహం పై అభియోగం మోపడానికి ఆమె మొదటిభర్తకు నైతికబలం చాలదన్నాను. కారణం, అతగాడికి యిద్దరు పెళ్ళాలున్నారుగదా. ఒకవేళ ఇందుకు పూనుకుంటాడూ, లాయర్లు ఇతని కేసును ఫైల్ చేయకపోవచ్చు. కేవలం మేజిస్ట్రేటుమాత్రం నూతన దంప తులకు ఏదో మామూలుశిక్ష విధించవచ్చు. అప్పుడు సాం ఘిక దురన్యాయాలకు గాంధీజీవలె తూర్పారబట్టడానికి నూతన దంపతులకు సదవకాశం లభిస్తుంది. ఆవిధంగా ఉభ యుల్లో తమ ప్రాంతంలో కొత్త సంఘ సంస్కరణోద్యమానికి నాయకత్వం వహించే భాగ్యం లభిస్తుందని చెప్పాను. సాం

ఘిక చైతన్యము, పోరాటశక్తిగల నూతన దంపతులకు ఈ సలహా నచ్చింది. దీన్ని వారు అగ్నిపరీక్ష గావించుకున్నారు. ఉభయులూ పరమానందంతో మావద్ద సెలవు పుచ్చుకున్నారు. తమ పట్టణానికి వెళ్ళగానే ఉభయులూ వివాహం చేసుకున్నారు. స్థానికంగా వున్న అభ్యుదయ వాదులందరూ నూతన దంపతులకు శుభాకాంక్షలు తెలియజేశారు.

వివాహం అయి రెండు నెలలు గడచిపోయింది. ఒక నాడు ఆయువతి ఒక గొందిలోనుంచి వెళ్తున్న తన మొదటి భర్తనుచూచింది. అతను తన కోసమే వెతుక్కుంటున్నట్లు కని పించాడు. ఇదేదో ప్రమాదం ముంచుకొచ్చినట్లు ఆమె అను మానించింది. పిమ్మట రావుకు తెలియజేసిందా విష యం. మిత్రుడు రావు ధైర్యవంతుడేగాదు, మంచి లౌకికుడు కూడా. రావ్ వెళ్ళి 'యువతి మొదటిభర్తను కలుసుకుని' తనయింటికి రావలసిందని గౌరవపురస్సరంగా ఆహ్వానించాడు. డిన్నర్ కు రావలసిందిగా కోరాడు. రావ్ ఒకవిందు ఏర్పాటు చేశాడు. ఆ విందుకు అభ్యుదయ భావాలుగల ఒక 50 మంది స్నేహితుల్ని ఆహ్వానించాడు. ఇదంతా చూస్తే యువతి మొదటి భర్తకు అంతా ఏమిటో అయోమయంగా వున్నట్టు తోచింది. నూతన దంపతు లిద్దరూ (రావ్, ఆ యువతి) ప్రధాన అతిథికి - యువతి మొదటి భర్తకు రోజా పూదం డలు వేశారు. ఉభయులూ అతనికి పాదాభివందనం చేశారు. ఆశీర్వాదంకోసం ఎదురుచూస్తున్నారు. "ప్రధాన అతిథి" నవ్వాడు. విందుకొచ్చిన వారంతా విరగబడి నవ్వారు. ఆ తర్వాత యువతి మొదటి మగడు - "ప్రధానఅతిథి"గారు-

నూతన దంపతుల్ని ఆశీర్వదించారు. భారతదేశంలో ఇటు వంటి గొప్ప సాంఘిక విప్లవాన్ని తీసుకొచ్చినందుకు గాంధీ జీని సంస్మరిస్తూ అంతా పాటపాడారు. శతాబ్దాల సాంఘిక దురాన్యాయానికి యిది భరతవాక్యం అనుకున్నారు.

# పార్వతి పునర్వివాహం

ఆరోజుల్లో ఆంధ్రదేశానికి సంబంధించిన ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ (మద్రాసు)లో ఇన్స్పెక్టర్‌గా వుండేవాడిని. ఆంధ్ర ప్రాంతమంతా తిరిగి అమోనియా సల్ఫేట్ వాడకాన్ని ప్రచారం చేస్తూ అమ్మకాల్ని ప్రోత్స హిస్తూ వుండడం నావిధులుగా వుండేవి.

ఈ ఉద్యోగంతోపాటు నాకు సంఘసంస్కరణ అంటే వల్లమాలిన ప్రేముండేది. మనం- హిందువులం ఫ్యూడల్ జీవి తాన్ని గడుపుతున్నామని అనుకుంటూ వుండేవాడిని. మన స్త్రీలు అనేక దురాచారాలకు, సాంఘిక అన్యాయాలకు గురి అవుతున్నారు ఉదహారణకు బాల్యవివాహాలు, నిర్బంధవైధవ్యం వేశ్యాలంపటత్వం (కొన్నిచోట్ల వీరిని 'దేవదాసీ'ల నికూడ అనేవారు); యిలాగా మరికొన్ని అమానుషమైన సామాజిక రుగ్మతలు భారతీయ స్త్రీ జీవితాన్ని కలుషితం చేసివేశాయి. అప్పట్లో గాంధీజీ కుళ్ళుసమాజాన్ని మందిచ్చి ఉద్ధరించ ప్రయత్నించాడు. తమ చుట్టూవున్న సమాజాన్ని సంస్క-

రించవలసిందిగా భారతీయ యువకుల్లో మహోత్సాహం సంచలనం కల్గించాడు. ఆ సమయంలోనే అభివృద్ధి నిరోధకులైన తమ పెద్దల భావాలనుండి విముక్తి చెందడానికి ఉత్తమనాయకత్వంకోసం మోసులెత్తిన యువకులంతా ఎదురుచూస్తున్నారు. అటువంటి నాయకత్వం వహించే అదృష్టం లభించినవారిలో నేనొకడిన్ని. విధవా పునర్వివాహాలు చేయించడమంటే ఆ రోజుల్లో అదొక యుద్ధరంగమే. ఇందుకు, ఇంకా మరికొన్ని స్త్రీ హక్కులసాధన కొరకు 1925 నుండి నేను పోరాటం ప్రారంభించాను.

ట్రావెలింగ్ ఇన్స్పెక్టర్ ఉద్యోగంవల్ల ఆంధ్రదేశమంతటా తిరగడానికి నాకెంతో అవకాశం లభించింది— ఆరోజుల్లో.

ఒకసారి బళ్ళారిలో క్యాంపువేశాను. బహుశా అది 1930లో అనుకుంటాను. ఒకనాటి ఉదయం ... చలిచలిగా వుంది వాతావరణమంతా ముగ్గుబుట్టలాంటి తలనెరసిన ముసిల్ది ఒకర్తె యువతియైన ఒక విధవను వెంట పెట్టుకొచ్చింది. నేను సాగిస్తున్న సంఘసేవా కార్యక్రమాలకు నన్ను అభినందించింది. ఆ యువతి వృద్ధురాలి మునుమరాలే. యువతి పేరు పార్వతి. ముసలమ్మ ఆవిడిన్ని నాకు పరిచయం చేసింది. పార్వతి పది సంవత్సరాలకే వైధవ్యం పొందింది. ప్లేగు వచ్చి పార్వతి పసిభర్త చనిపోయాడట! తిరిగి పార్వతికి వివాహం చేయవలసిందిగా పార్వతి అమ్మమ్మ నన్నుకోరింది. అప్పటికే విధవాపునర్వివాహ ఉద్యమంలో నాకు మూడు సంవత్సరాల అనుభవం వుంది. దాదాపు ఒక డజను విధవా

వివాహాలన్నా నా చేతిమీద జరిగాయప్పటికి. అయితేఅందులో కొన్ని విఫలమైనాయి. కొన్ని కాపురాలు ముద్దుగా సాగి పోతున్నాయి. సమాజం నుండి వెలివేసేబుద్ధి నెమ్మదిగా అంతమొందుతోంది. వాస్తవానికి సమాజ బహిష్కృతుడ్ని చేయడమంటే - ఘోరమైన శిక్షన్నమాట. ఎంతో నైతిక బలమున్న వ్యక్తులైతేతప్ప అభ్యుదయకర ఉద్యమాలలో గట్టి చొరవతో పనిచేయడమంటే సాధ్యంకాని పని. గాంధీజీ సృష్టించిన సంస్కరణ యుక్తమైన సాంఘిక వాతావరణంవల్ల దేశంలో అభ్యుదయకర యువకులు నెమ్మదిగ అయినా ముందడుగు వేస్తున్నారు.

అయితే మాసంఘసంస్కరణ కార్యకలాపాలకు నాడు బళ్ళారి పేరుమోగిన ప్రాంతంగావుండేది. బాల వితంతువు-పార్వతికి అప్పటికి 22 సంవత్సరాలు. చూపులకు చిన్నది. ఆ మరుసటిరోజే పార్వతిని నాదగ్గరకు తీసుకురావలసిందిగా ఆమె ముత్తవతో చెప్పాను. ఈలోపు జరగవలసిన కధఅంతా ఆలోచిస్తానని చెప్పాను. స్థానికంగా మన ఉద్యమం అంటే అభిమానించే వాళ్ళందరితోను సంప్రదించాను. ఆ పిల్లగుణం మంచిదికాదని లోకం కోడై కూస్తోందండి- అని వాళ్ళంతా నాతో చెప్పారు. ఆమెకు (పార్వతికి) తిరిగి వివాహం జరిపించడం అంటే మన ఉద్యమానికే దెబ్బ అని చెప్పారు. ఈ కార్యాన్ని విడిచిపెట్టమని నన్ను పదేపదే కోరారు వాళ్ళు.

మా సంస్కరణ సంస్థ అప్పటికి జరిపిన పన్నెండు వివాహాల్లోనూ ఈసరికి రెండు పునర్వివాహాలు విఫలమై పోయాయి. పునర్వివాహానికి ముందు ఆడపిల్లలకు చాల చెడ్డ

పేరుందన్న సాకుచూపి భర్తలు తమ భార్యల్ని విడిచిపెట్టే శారు ఇందుకు ప్రజాభిప్రాయాన్ని శంకించాల్సిందేనని ఆ ఆడపిల్లల్ది మాత్రం కాదని మేం అర్థం చేసుకున్నాం. ఇటు వంటి విషయాల్ని ఏదోవిధంగా సరిచేయాలని ఎంతో ప్రయ త్నించాం. కాని విఫలమయ్యాం. అయినాగాని పై రెండు వ్యవహారాల్లో విఫలమొందడం వల్ల పార్వతి కోర్కెను అంగీకరించడానికి నాకు సంశయం కలిగింది.

ఆ మరుసటిరోజు...పార్వతి, ఆమె ముత్తవతల్లి నా దగ్గరకు వచ్చారు. ఎందుకనో వణకిపోతున్నారు. వివాహం చేసుకుంటానన్న యువకుడెవడైనా మీకు తగిలాడా? అని ప్రశ్నించాను.

"ఎవ్వరూ లేరండి! మీ సహాయమొక్కటే మిగి లింది"

"పార్వతీ! నేనొక ప్రశ్న అడుగుతాను. దాపరికం లేకుండా నిజం చెపుతావూ" అన్నాను,

"తప్పకుండా బాబాయిగారూ!"

"పార్వతీ, నీకు కొంత చెడ్డపేరుందట. నిజమేనా?" పార్వతి తలవంచుకొంది. సమాధానం లేదు. కాని కంటి వెంట అశ్రుబిందువులు రాలుతున్నాయి.

"పార్వతీ! నేనొకవేళ నీకు తిరిగి వివాహం చేస్తాననుకో. కాని మా ఉద్యమానికి కళంకంరాకుంటుందా. నీకు సహాయం చేయడానికి నేనెందుకు అనుమానిస్తున్నానో యిప్పడైనా అర్థమైందా?"

ఆమె సమాధానం చెప్పలేదు. ఆమె తల మరింత కిందకు వంచుకుపోయింది. యింతకు ముందుకన్నా కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది.

"అమ్మా పార్వతీ! ఏదో ఒక తప్పు త్రోవ తొక్కావు".

పార్వతి బోరుమని ఏడ్వడం ఆరంభించింది కొంత సేపాగి వినీ వినబడనట్లు యిలా చెప్పింది: "నేను చాల చిన్న దాన్ని ... అప్పటికి నా వయస్సు 18 సంవత్సరాలే ... చిన్న వాడు ... ఆయన ... నా పొరుగునే వుండేవాడు ... నేను అమా యకురాల్ని ... ఇప్పుడు అటువంటిదానికోసం ... ఏమీ ప్రాకు లాడ్డంలేదు ..."

"కాని, మరింక దేనికి యువకులు వెంపర్లాడడం?"

"బాబాయిగారూ ... నాకో బిడ్డ కావాలని వుంది ... నాఅనే బిడ్డ ... పెళ్ళీ పేరంటం లేకుండా ... నాబిడ్డ అంటే ... ఎవరైనా నవ్విపోరూ? ... నన్ను బ్రతకనిస్తారా? ..."

ఈ సమాధానం నా జీవితంలోనే విస్మయాన్ని కల్గిం చిన ఘటన నాకళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. "ఆమెను ఆదుకో"మని నా హృదయం పదేపదే నన్ను వెంబడించింది. కాని విధవాపునర్వివాహ ఉద్యమం గతి ఏమికాను? కాని ద్వేషపూరిత ప్రమాదం వుద్యమానికిఎక్కువై పోతుందేమో.

కొంతకాలం గడచిపోయింది ... నేను కోలుకున్నాను. యింతకాలం ముభావంతో మెలగుతూ వచ్చిన నన్ను క్షమిం చమని పార్వతిని వేడుకొన్నాను. నీకు తగిన భర్త దొరకడం చాల కష్టమమ్మా అని ఆమెతో చెప్పేశాను. అదే సమయం

లో యిందుకు శాయశక్తుల కృషిచేస్తాననికూడా ఆమెకు హామీగా యిచ్చాను. చివరకు ఆమెను ఈ ప్రశ్న అడిగాను

"పార్వతీ, నీభర్తతో నీవు నమ్మకంతో మసలుకుంటావా?"

అదే మొట్టమొదటసారేమో... పార్వతి ముఖాన నవ్వు చిలకరించింది. "తప్పకుండాను, అందులో ఏమీ సందేహంలేదు బాబాయిగారూ," అంది పార్వతి.

"అమ్మా పార్వతీ, నాకు కొంచం ఆలోచించుకోడానికి వ్యవధివ్వమ్మా. నీవుకూడా ఈ విషయం బాగా ఆలోచించుకో. ఇదే సమయానికి రేపు మళ్ళీ నన్ను కలుసుకో. అపుడు మనం ఒక నిర్ణయానికి వద్దాం" అన్నాను.

ఆమర్నాడు... పార్వతి, ముత్తవతల్లి అనుకొన్న విధంగానే వచ్చేశారు. ఇదివరకడిగిన ప్రశ్ననే తిరిగి అడిగాను.

"పార్వతీ, వివాహమైతే నీవు నీభర్తతో భక్తితో నమ్మకంతో మెసలుకుంటావా?" అని

"అలాగే బాబాయిగారు, తప్పకుండా చక్కగా మెసలుకుంటాను. మీకుగాని, నాభర్తకుగాని ఎటువంటి చెడ్డ పేరూ తెచ్చిపెట్టనండీ" అంటూ పార్వతి తల వంచి నాకు పాదాభివందనం చేసింది. నాకళ్ళవెంట నీళ్ళు బొటబొట రాలాయి.

"నేను చేయవలసినదంతా చేస్తానమ్మా. పార్వతీ, నీకు కాబోయే భర్త నీగతాన్ని, మన్నించి మరిచిపోయేవాడుగా అందరికంటె ఉత్తముడై వుండాలి. నీకు శుభం చేకూరుతుందనే ఆశిస్తున్నానమ్మా నీమాటను నీవు నెరవేర్చుకోవాలిసుమా!"

"నమస్తే" చెప్పి పార్వతి గుండె బరువు దిగినట్లు భావించి వెళ్ళిపోయింది. నాకో అదో సమస్య, భారం.

ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు అటువంటి పిల్లకాయికి భర్త నెక్కడ వెదకేది నేను? ఆమెను ఉత్తమ ఇల్లాలుగా సత్ప్రవర్తనాను వర్తినిగా చేయగల ఆశయమున్న సాధుసత్త ముడుగావాలి. అన్నిటికంటే మించి సంఘం వెక్కిరింపులకు, తన్నేతాపులకు తట్టుకుని నిలబడగలిగే నైతికసత్తా వుండాలి. మన సమాజంలో అటువంటి వ్యక్తులున్నారా అని నా అనుమానం? అటువంటివాళ్ళు దొరకడం అసంభవం అని చెప్పినట్లు గుర్తుకొచ్చింది. అయినా ఆశలేకపోయినా కృషి సల్పుతున్నాం గదా అనుకున్నాను.

ఐ. సి. ఐ. కంపెని ఇన్స్పెక్టర్ హోదాలో తిరుగుతున్నప్పుడల్లా పార్వతికి సరైన భర్త ఎక్కడ దొరుకుతాడా అని ఎప్పుడూ నా మనసులో అనుకుంటూనే వుండేవాడిన్ని నంద్యాలవద్ద ఒక పోలీసు హెడ్ కాన్స్టేబిల్ తని టికి రావలసిందిగా నన్ను ఆహ్వానించాడు యిద్దరికి భోజనఏర్పాట్లు చేశాడు. మాకు కూరానార సప్లయి చేస్తున్న 45 ఏళ్ళ వయస్సుగల ఒక విధవని చూశాను. చివరికి పరిశీలిస్తే ఆమెనితడు వివాహం చేసుకోలేదని, 'వుంచుకున్న' అమ్మాయని తేలింది. అపుడు ఆతిధ్యా యిచ్చిన గేస్తుతో చెప్పాను. 30 ఏళ్ళ వయస్సుండీ, యింటిని శుభ్రంగా చక్కగా వుంచగలిగిన మనిషి యింక వివాహంగాకుండా వుండడం మన దేశంలో చాల వింతైన విషయమండీ" అన్నాను కాన్స్టేబిల్ సమాధానం చెప్పలేదు. వూరికేనవ్వి వూరుకున్నాడు. అతడి

వంక ఆశ్చర్యంతో చూశాను. అతడి ప్రవర్తనచూస్తే నాకు చాలా ఆశ్చర్యం వేసింది. "వివాహం" అనేమాట వింటే మన హిందూసమాజంలోని విధవల దుఃఖమయావస్థ తనకు జ్ఞప్తికి వచ్చిందన్నాడు. విధవల దీనావస్థవిషయమై అతను వెలిబుచ్చిన ఆందోళనతో నేనేకీభవించాను. మా విధవా పునర్వివాహ సమితిలో చేరి సంఘసంస్కరణ కార్యకలాపాల్లో పాల్గొనవలసిందిగా అతడికి సలహా చెప్పాను. ఆవిధంగా కొంత వరకు సమస్యను పరిష్కరించడానికి తోడ్పడవచ్చుగదా అని చెప్పాను. ఇందుకు వెంటనే అతడు అంగీకారం తెలిపాడు. విధవను వివాహమాడడానికి ఒప్పుకున్నాడు పార్వతి అడ్రెసు అతడికిచ్చాను.

కొన్ని వారాలు గడిచిన తరువాత అతడివద్దనుండి నాకో ఉత్తరం వొచ్చింది. అందులో పార్వతిని కలుసుకున్నానని ఆమె నచ్చిందని, వివాహం చేసుకోడానికి తాను సిద్ధంగా వున్నానని వ్రాశాడు. అతను ఆమెనుగూర్చి సరిగ్గా ఆచూకీ తీయలేదనే నేననుకున్నాను నా సలహాపైనే అతడు మళ్ళీ బళ్ళారి వెళ్ళాడు వాళ్ళనీ వాళ్ళనీ అడిగి విషయాలు తెలుసుకున్నాడు. "నేను సంతృప్తి చెందాను" అని నాకు లేఖ వ్రాశాడు ఆమె పూర్వ చెడు ప్రవర్తనను గూర్చి ఒక్క ముక్క కూడా ఆ లేఖలో వ్రాయలేదతను అప్పుడు నేననుకున్నాను: విషయాన్ని ఇక చేయి జారిపోనివ్వకూడదు; విషయమంతా వివరించి చెప్పాల్సిన సమయం వచ్చిందనుకున్నాను. ఆ యువతిని పెళ్లాడవద్దని చివరకొక లెటరు వ్రాశాను నేను. యింతకంటే మరోమంచి విధవస్త్రీని వెతికిపెడతానని సూచిం

చాను. ఎట్టి పరిస్థితుల్లోను తాను పార్వతినితప్ప మరొకర్ని చేసుకోనంటూ నాకు జాబు వ్రాశాడు.

అతని ధైర్యానికి నాకెంతో ఆనందం కలిగింది వెళ్ళి అతన్ని అభినందించాను. అతనింతగా నిర్ణయానికి రావడానికి అతని జీవితంలో ఏదో ఒక ఘటన జరిగి వుంటుందని, అదే యింత త్యాగానికికూడా పురికొల్పి వుంటుందని భావించాను. ఈ రహస్యం తెలుసుకోవాలనే కోర్కె నాకుపుట్టింది. అతన్ని విషయాన్ని గూర్చి ప్రశ్నించాను. వెంటనే జవాబు చెప్పాడు. వైధవ్యం పొందిన వయస్సు గల చెల్లెలు తన కున్నదని, ఆమె భవిష్యత్తును తీర్చి దిద్దవలసిన బాధ్యత తన కున్నదని అతను చెప్పాడు.

"ఏమండీ, మీరామెను చూశారుగదూ! ఆమెకిప్పుడు 45 సంవత్సరాలుంటాయి. ఆమెనుగూర్చి మీ వుద్దేశం ఏమిటి? 11 సంవత్సరాలప్పుడు వైధవ్యంపొందింది. ఎన్ని పాపాలుచేసిందో నాకు తెలియదు. పాపాలేమి కర్మ? ఘోర నేరాలు కూడాను! ఈ 30 ఏళ్ళనుండి మా కుటుంబం అంతా ఆమెను కనికరిస్తూనేవస్తోంది. వివాహం చేసుకునే అవకాశమే చిక్కితే ఆమెకూడా అందరిలాగానే సుఖమయజీవితాన్ని గడిపేది. అందరికిమల్లేనే పుత్రపౌత్రాదులతో వర్ధిల్లేదే మరి. ఇంతటి దౌర్భాగ్యపు సమాజమేమండీ మనకు రెండు రకాల నీతులున్నాయి: మనకొకనీతి; పొరుగువాళ్ళకొక నీతి. నిస్సహాయురాలైన నా అనాథచెల్లెలు నేరక చేసిన నేరాలకు, పాపాలకు ప్రాయశ్చిత్తంగా నేను పార్వతిని వివాహమాడి, ఆమె జీవితాన్ని సుఖమయం చేస్తాను" అన్నాడు.

ఎంతధైర్యం, ఎంతటి ఉన్నతాశయం. సమస్యను యింత చక్కగా అర్థం చేసుకొని తనకు తోచిన నిర్ణయాన్ని అమలు జరపడానికి ధృఢనిశ్చయంతో ముందుకొచ్చిన అతనికి జోహారులర్పించడానికి నాకు మాటలుకూడా చాలలేదు. అతనితో పరిచయమైనందుకు నేనెంతో గర్వించాను.

వివాహం ప్రశాంతంగా జరిగిపోయింది ... తరవాత ఒకనాడు పార్వతి నాయింటికి వచ్చింది నాముందు నిలబడింది. చిరునవ్వు నవ్వాను. ఆ ముఖంలోని మనోభావాన్ని నేను అర్థంచేసుకున్నాను "అమ్మా పార్వతీ, నీ భర్త నీ గతాన్నిగూర్చి అడిగితే వున్నవాస్తవం అంతా తు. చ. తప్పకుండా చెప్పేశేయి. ఇదంతా నేనతనికి లోగడచెప్పాను అతను చాలా విశాలహృదయుడమ్మా. నాకు చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకో. అప్పుడప్పుడూ ఉత్తరాలు వ్రాస్తూండు నూర్గురు కొడుకులు, కూతుళ్ళతో వర్ధిల్లాలని దీవిస్తున్నా!" అన్నాను. పార్వతి నవ్వింది, పాదాభివందనం చేసి వెళ్ళిపోయింది.

సంఘసంస్కరణ అంటే చాల ప్రమాదకరమైనదీ, విసుగుపుట్టించేది కూడా. మనకు తెలియకుండానే కొత్తకొత్త సమస్యలు అప్పటికప్పుడు పుడుతూవుంటాయి ఈ అనాధ స్త్రీలందరికీ నేను తండ్రిగా భావించుకుంటాను. ఎప్పటికప్పుడు వాళ్ళతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూవుండడం, వాళ్ళయిళ్ళకి వెళ్ళి పలకరిస్తూండడం, వాళ్ళ కష్టాలేమైనా వుంటే పరిష్కరించడానికి తోడ్పడడం— ఇది నా కార్యక్రమంగా వుండేది.

పార్వతి కుటుంబం హాయిగా ఆనందంగా గడచి పోతోంది సెలవుల్లో వాళ్ళతోనే గడిపేవాడ్ని. రెండు మూడు సంవత్సరాలు గడచిన తరువాత పార్వతిలో ఏదో అసంతృప్తి అలుముకున్నట్లు గుర్తించాను. ఇ తరూ ఆమె మాతృత్వాం దాల్చలేదు. తను చేసే మొక్క బళ్ళకు, ప్రార్థనలకు దైవానుగ్రహాం లభించ లేదని నిరుదిస్తూండేది పార్వతి. తన 'కర్మ'కు ఖిన్నురాలయింది. ఆమె అలా వుండడంచూచి నామనస్సు బాగుండేదికాదు.

ఒక సంవత్సరం గడచింది వివాహమైన విధవస్త్రీలలో ఒకర్తె మా యింటికి వచ్చింది. తనను భర్త విడిచిపెట్టాడని భోరుమని ఏడ్చింది. అప్పుడామె గర్భవతి. ఇక చూడండి సమస్య ఎటువంటిదో నా యిల్లంతా విధవలతో నిండివుంది. వీరంతా వివాహం కోసం ఎదురు చూస్తున్నారు. కాబట్టి గర్భందాల్చిన ఈమెను ఎవరైనా హృదయంగల కుటుంబంలో కొంతకాలం ఉట్టిపెడితే మంచిదనుకున్నాను. ఆతర్వాత ఆమెను టీచర్‌గా తర్ఫీదు చేసేందుకు ఒక పాఠశాలకు పంపాలి. ఆతర్వాత నెమ్మదిగా ఎవరైన సహృదయులైన వారికి, బిడ్డలు లేనివారకి తనబిడ్డను దత్తత యివ్వవలసిందిగా ఆమెను కోరాల్సివుంది.

ఆమెను కొంతకాలం తమవద్ద అట్టిపెట్టుకోడానికి పార్వతి ఆమె భర్తకూడా అంగీకరించారు. బిడ్డకు కావల్సిన సాహాయ్యమంతా తామే చేస్తామన్నారు. గర్భవతికి మొగబిడ్డ పుట్టాడు పేరు వేణు. వేణుని పార్వతికి వప్పగించి తను సేవాసదన్‌లో చేరింది. అనాధస్త్రీ జనోద్ధరణకు ఏర్పడిన

సంస్థ సేవాసదన్. దురదృష్టవశాత్తు వేణు స్వంతతల్లి ఎక్కువ కాలం జీవించలేదు. కాని వేణు పార్వతిదగ్గరే రోజురోజుకీ తీరుగా పెరుగుతున్నాడు. అతనిభవిష్యత్తు నిర్ణయం కాలేదు. ఇదో తలనొప్పిగా తయారైంది నాకు. అప్పటికి వేణు వయస్సు రెండు సంవత్సరాలు.

పార్వతి, వేణు ఎంతో అన్యోన్యంగా వుండడం చూచాను నేను. మూడు సంవత్సరాలనాడు బిడ్డలేకపోవడం వల్ల ఆమెలో కనపడ్డ అసంతృప్తిజ్వాలలు నేడు అవుపించడం లేదు. మాతృత్వాన్ని స్వీకరించాలన్న తనఆశయం యింకా నెరవేరనేలేదే అని పార్వతితో ఒకసారి అన్నాను. ఈమాట అన్నానో లేదో ఆమెలో ఏదో అవ్యక్తమైన పెనుగులాట అవుపించడం చూచి ఆశ్చర్యపోయాను. వెంటనే వేణూను చేతుల్లోకి తీసుకొని తన హృదయానికి హత్తుకుంది. బిడ్డ చిరునవ్వు తొలకరించేవరకు ముద్దులతో ముంచెత్తింది వేణుని. "బాబాయిగారూ, ఇదుగో నాకొడుకు! ఈ చిలిపి చేష్టల చిన్నారిమీదనే నా ప్రేమానురాగాలన్నింటినీ వుంచాను. ప్రత్యేకంగా 'నా' అనేవాడు లేకపోయినా బాధలేదు. అలా కోరుకోడం లేదుకూడా నా స్వంతబిడ్డే పుడితే, ఈ అనాధ బిడ్డకు నేనేం ఉపకారం చేయకల్గుతానని కూడా నేను బాధ పడిపోయాను. గతంలో చేసిన ప్రార్థనల్ని, కోర్కెల్ని మరచిపోయి, నాకు బిడ్డ కలుగకుండా వుండుగాక అని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను. నేనిపుడు మాతృత్వాన్నే స్వీకరించాను. ఇదే వరప్రసాదమనుకుంటున్నాను." పార్వతి ఎంతో సంతోషంతో ఆనందంతో ఉప్పొంగిపోతూ వెళ్ళిపోయింది.

అమ్మయ్య! నాకూ ఉపశాంతి! చివరకు ఒక ఉత్తమ యిల్లాలును, ఆనందమయజీవితాన్ని చూడగల్గాను కదా అని ఇప్పటికీ అనుకుంటూంటాను:

# "ఖాక్సార్" యోధుడు

ఖాన్ సాహెబ్ అల్లామా మష్రీక్ ప్రజానాయకుడు. గాంధీ, జిన్నాలవలెనే, ఈయనకూడ "ఖాక్సార్స్" సంస్థనొకదాన్ని నెలకొల్పి దాన్నొక ప్రజోద్యమంగా రూపొందించాడు. ఉత్తరహిందూస్తానంలో "ఖాక్సార్స్"ను 'దేవుని సేవకులని' వ్యవహరిస్తారు ఈ ఉద్యమం కొంతవరకు మత ప్రాతిపదికమీద నెలకొల్పబడ్డా. ఖాన్ సాహెబ్ కొన్ని ఆశయాలు, లక్ష్యాలుగల వ్యక్తి. ద్వితీయ ప్రపంచయుద్ధం ప్రారంభమైనప్పుడు దేశంలోని రాజకీయపార్టీలు తమ కొమ్ముకాస్తున్నాయా లేదా అని ఆయానాయకుల నడిగి బ్రిటిష్ ప్రభుత్వం తెలుసుకోగోరింది. ఈ సందర్భంలో ప్రభుత్వం గాంధీ, జిన్నా, అల్లాకు మష్రీక్‌ను, మరి కొంత మంది ప్రజానాయకుల్ని కలుసుకుని సంప్రదించింది. ఖాన్ సాహెబ్ మాత్రం తన స్థితినిగూర్చి ఏమీ చెప్పకుండా 'వేచి-చూడమ'నే దృక్పథాన్ని అవలంభించాడు. అంతటితో సంకటంలో పడ్డ ప్రభుత్వానికి, ఉత్తర భారత ప్రజానాయకుడుగా ఎంచబడుతున్నా ఈయనకు మధ్య రాజకీయ నాటకం

ప్రారంభమైంది. దురదృష్టవశాత్తు రాజకీయ నాటకం ఎలా ఆడాలో ఖాన్‌సాహెబ్‌కు తెలియకపోయింది.

ఈయన మతసంబంధమైన కొన్ని గ్రంథాలు వ్రాశాడు. ముస్లిం ప్రపంచంలో వీటికి మంచిగిరాకీ వుంది. ఫలితంగా ఈయనకు కావలసినంత డబ్బు సంపాదించిపెట్టాయి. పైగా ఈయన ప్రభుత్వంలో పెద్ద ఉద్యోగస్థానాన్ని అలంకరిస్తున్నాడు. వైస్రాయి కార్యనిర్వాహక వర్గ సభ్యుడవుతాడని కూడా ఆరోజుల్లో వదంతివుండేది. ఇంత 'ఆశాజనకమై'న భవిష్యత్తు వున్నా, శ్రీ ఖాన్ ఉద్యోగానికి రాజీనామా పెట్టి రాజకీయాల్లో ప్రవేశించాడు. భారత దేశంలోని ముస్లింలకు నాయకత్వం వహించడంలో జిన్నాకు ఈయన ప్రత్యర్థి అని అంటూ వుండేవారు.

ఈ సందర్భంలో ఖాన్‌సాహెబ్ నుండి ప్రభుత్వం వాగ్దానాన్ని పొందలేకపోయింది. ప్రభుత్వం వెంటనే ఖాక్సార్ పార్టీని నిషేధించింది; అనేక నిర్బంధ చర్యలు అమలుజరిపింది. ఖాన్‌సాహెబ్‌ను జైల్లో పెట్టింది. ఈయన్ని రెండు వేల మైళ్ళ దూరంలోవున్న పంజాబ్ నుండి దక్షిణభారతంలోని వెల్లూర్ సెంట్రల్ జైలుకి మార్చింది. ఈ ప్రాంతంలో ఖాన్ సాహెబ్‌కి అనుయాయులు లేరు సరికదా, ప్రజలకు ఈయనంటే ముక్కూ మొగం తెలియదు. ఆ సమయంలో మాలో చాల మందిమి అంటే రాజకీయాలతో సంబంధమున్నదని అనుమానించబడ్డవాళ్ళం వివిధ పార్టీలకు చెందినవాళ్ళం వెల్లూరు జైల్లోనే డిటెన్షన్‌లో వున్నాం.

ఖాన్ సాహెబ్ మంచి అవయవ సౌష్టవంవున్న వ్యక్తి ధైర్యవంతుడు, స్థిరచిత్తుడూను. అప్పట్లో జైల్లోవున్నవా రంతా (దాదాపు ఒక వందమంది వున్నారు)-డాక్టర్ పట్టాభి ప్రొఫెసర్ రంగా, మాజీ స్పీకర్ సాంబమూర్తి వగైరాలంతా ఆయనంటే గౌరవం చూపేవాళ్ళం. ఖాన్ సాహెబ్ ని గాంధీ తత్వంవైపు మార్చాలని డాక్టర్ పట్టాభి ఎంతో ప్రయత్నం చేశారు. మరోవైపున పట్టాభిని "ఖాక్సారి జాని"కి మార్చా లని ఖాన్ సాహెబ్ ప్రయత్నం. కాని ఉభయులు విఫల మొందారు! వీళ్ళ వాదాల్ని చూచి మేమంతా నవ్వుకుంటూ వుండేవాళ్ళం.

ఖాన్ సాహెబ్ లో ఒకలోపం వుంది. అప్పట్లో జైలు సూపరింటెండెంటుగా వున్నా మేజర్ గిల్ పట్ల ఈయన కొన్ని సమయాల్లో చాల అసహ్యంగా, దుందుడుకుతనంగా ప్రవర్తిం చాడు. ఒకవిధంగా చూస్తే మేజర్ గిల్ చాల గొప్పవాడు లౌకికుడు, సంస్కారం గలవాడు, శాంతంగా వుండేవాడు. అయితే అతను ప్రభుత్వానికి నమ్మినబంటుగానే వ్యవహ రిస్తున్నాడు. అతని జీవితలక్ష్యం- ప్రభుత్వంలో ఉన్నత స్థానాన్ని అందుకోవడమే. ఖాన్ సాహెబ్ తో వ్యవహరించడ మంటే గిల్ కు కొంత కష్టంగానే వుండేది తొందరపడక, అంతిమ ఫలితంకోసమే జాగ్రత్తపడుతూ వుండేవాడు. ఖాన్ సాహెబ్ పరుషవాక్యాలన్నింటిని గిల్ గుర్తుపెట్టుకుంటూ వుండేవాడు. మరోవైపున ప్రభుత్వం తనవైపున నిర్బంధ విధానాన్ని అనుసరిస్తూందన్న జ్ఞానమే ఖాన్ సాహెబుకు వుండేదిగాదు. కాని ఇలా కొంతకాలం జరిగేసరికి, వాస్తవ

పరిస్థితిని గ్రహించమని. యితర రాజకీయ నాయకులమాదిరే నీవుకూడా శాంతంగా వ్యవహరించాల్సిన అవసరముందని గిల్, ఖాన్‌సాహెబ్‌కు ఎన్నివిధాలో నచ్చచెప్పాడు. కాని ఖానసాహెబ్ వీటిని ఖాతరుచేయలేదు. జైల్లోని తన సహచరులకువలే తాత్కాలికంగా సరిపెట్టుకోడానికి నిరాకరించాడు.

ద్వితీయ ప్రపంచయుద్ధం సాగుతున్న గడ్డు కాలంలో భారతప్రభుత్వం (బ్రిటిష్) క్లిష్ట పరిస్థితుల్లో చిక్కుకొంది. తనను వ్యతిరేకించిన యితర రాజకీయ పార్టీల నేవిధంగా శిక్షించారో ఈయన్నికూడా అలాగే శిక్షించదలచింది ప్రభుత్వం. ఖాక్సార్లకు ఆదేశాలుగాని, ఉత్తర్వులుగాని వచ్చేది ఖాన్‌సాహెబ్ నుండేనని తెలుసుకొంది ప్రభుత్వం. ఈయన్ని అరెస్టు చేయడంతో వాళ్ళకి నాయకత్వం లేకపోయింది. తమ నాయకుణ్ని జైలునుండి విడిపించుకొనేందుకుగాని, కనీసంతిరిగి పంజాబ్ జైలుకు మార్పించుకొనేందుకుగాని ప్రభుత్వంపై ఒత్తిడి తేవడంలో ఖాక్సార్లు విఫలమయ్యారు. ఆతర్వాత ప్రభుత్వంవారు బ్యాంకులో వున్న ఖాన్‌సాహెబ్ 10 లక్షల రూపాయలధనాన్ని స్వాధీనం చేసుకుంది. ఒక బంగళాను జప్తు చేసింది. ఖాన్‌సాహెబ్ భార్యని భర్తనుండి మరింత వేరుపరచారు. పర్యవసానం ఈక్లిష్టదశలో చిక్కుకున్న ఆమె నిస్సహాయురాలై పోయింది. పైగా మగవారిలో ఆమెకు స్నేహితులుగాని బంధువులుగాని లేరు. ఆమె బయటకు అడుగు పెట్టరాదని, భర్తను కలుసుకోకూడదని ప్రభుత్వం ఆంక్ష విధించింది.

భర్తతో సాగించే ఉత్తరప్రత్యుత్తరాలను ప్రభుత్వం తీవ్రంగా సెన్సార్ చేసేది. అయితే ఈ దారుణ దమననీతి అంతా తదితర రాజకీయ నాయకులకు కొత్తేమీ కాదనుకోండి. ఆవిధంగా ఖాన్‌సాహెబ్ శక్తియుక్తుల్ని కించపరచడంలోను అవమానించడంలోను ప్రభుత్వమే విజయం సాధించింది.

ప్రభుత్వం తనపట్ల చూపుతున్న అవమాన పరంపరను ఖాన్‌సాహెబ్ ఓపికతో సహించాడు. కాని శత్రువుపై రోజు రోజుకి ద్వేషభావం రగుల్కొంటోంది ఆయనలో. తన సతీమణిని, పిల్లల్ని అవమానపరిచినప్పుడు ఆయన మరింత ఉగ్రుడైపోయేవాడు. నిస్సహాయత, దవానలంవలె పెల్లుబుకుతున్న ద్వేషంవల్ల నరాలు అతనివశం తప్పిపోయాయి. మూలిగే నక్కమీద తాటికాయపడ్డట్టు, ఈ సమయంలోనే ఒక కొట్లాట జరిగింది. ప్రజల్ని చెదరగొట్టేందుకై పోలీసులు బాష్పవాయువు ప్రయోగించినప్పుడు ఆయన పదేండ్ల కొడుకు (ఒక్కడే కుమార్డు) చనిపోయాడు. ఆ విధంగా ఖాన్‌సాహెబ్‌కు నరాల బలహీనత ఎక్కువైపోయింది. తుదకాయన ఆ బలహీనతనుండి కోలుకోనే లేదు. తన స్వరాష్ట్రమైన పంజాబ్‌కు మార్పించమంటూ ప్రభుత్వంపై వత్తిడి తెచ్చేందుకై ఖాన్‌సాహెబ్ నిరాహారదీక్షబూని ప్రయత్నించాడు. కాని అది విఫలమైంది.

భీకరమైన సింహగర్జనలతో జైలుప్రవేశం చేసిన ఈ ధైర్యశాలి రెండు సవత్సరాల అనంతరం నరాలపటుత్వం బాగా సడలిపోవడంతో చీకు సింహంగా మారిపోయాడు. మరోవైపున జైల్లోవున్న ఆయన సహచరులమైన మేముకూడా

ఇటువంటి రాజకీయ నిర్బంధ విధానాలకు గురైనవాళ్లకు, మా సలహాలద్వారా, ప్రేమానురాగాలతో, ఆహ్లాదకర సంభాషణలతో మే మాయన్ని రక్షించడానికి ఎంతో ప్రయత్నం చేశాం. కాని లాభం లేకపోయింది. ఖాన్ సాహెబ్ కు పిచ్చి ఎక్కకముందే ఆయన్ని విడిచిపెట్టినాసరే లేదా స్వరాష్ట్రానికి బదిలీ చేయనన్నా చేయమని ప్రభుత్వానికి సిఫార్సు చేయవలసిందిగా మేజర్ గిల్ ని మేమంతా కోరాము. పాపం మేజర్ ఎంత ప్రయత్నం చేస్తే ఏం? ప్రభుత్వం తననిశ్చయాన్ని ఏమాత్రం మార్చుకోలేదు.

ఒకరోజున జైలు వరండాలో ఖాన్ సాహెబ్ కుర్చీ వేసుకుని కూర్చున్నారు. అక్కడున్న ఒక మహావృక్షం తన చల్లటినీడను ప్రసాదిస్తూవుండేది ఒకనాడాయన నన్ను దగ్గరికి పిలిచారు. చెట్టుకొమ్మకేసి చూపుతూ ప్రశ్నించారు: "ఎందుచేత నాభార్య ఎక్కడాచోటులేనట్లు కొమ్మల్లోకి పోయి కూర్చుంటుంది? ఎందుకలా నావైపుకేసి అలాచూస్తూ కూర్చుంది? ఆవిడ మాట్లాడదేం?" ఇదే ధోరణిలో ఖాన్ సాహెబ్ ఈ విషయాన్ని తన ప్రతిస్నేహితుడికీ చెప్తూతూ వుండేవాడు.

ఖాన్ సాహెబ్ గాంధీవాదులకు వలె బాధల్ని కొట్టినట్లు అనుభవించేతత్వాన్నీ అలవర్చుకోలేదు; అటు కమ్యూనిస్టులు సమయానుకూలంగా వేసే ఎత్తుగడల్నీ అలవర్చుకోలేదు. ఇటువంటి బాధల్ని సహించాలంటే ఎంతో త్యాగం కావాలి. ఈ త్యాగాలకు ఆయనగాని, ఆయన కుటుంబంగాని సిద్ధం గాకపోవడానికి ఆయన బలహీనతే కారణం.

1942 లో రాజకీయవాదు లందర్నీ విడుదల చేశారు. అందులో మాలోవున్న 800 మందికూడా వున్నారు. కాని ఖాన్‌సాహెబ్‌ను మాత్రం ప్రభుత్వం విడుదల చెయ్యలేదు. మా విడుదలపుడు ఎంతో బాధతో కళ్ళనీళ్ళ పర్యంతమై మేమాయనవద్ద సెలవు పుచ్చుకున్నాం.

# విధ్యుక్తధర్మం

ద్వితీయ ప్రపంచయుద్ధసమయంలో నేనంటే ప్రభుత్వానికి రాజకీయంగా అనుమానంవుండేది. నావలెనా స్వాతంత్ర్య సాధనకు కృషి చేస్తున్నవారు వివిధ రాజకీయపార్టీలకు చెందినవారు అనేక మంది వున్నారు. 1940 సంవత్సరం నాటికి ఈ బాపతువాళ్ళం ఒక వందమందిమి జేరాము. మేమంతా మద్రాసు రాష్ట్రానికి సంబంధించినవాళ్ళం. నెల్లూరు సెంట్రల్ జైల్లోమమ్మలందర్నీ డిటెన్యూలుగా వుంచారు. మాలో కొందరిప్పుడు మంత్రులయ్యారు. ముఖ్యమంత్రులు, పార్లమెంటు, శాసనసభాసభ్యులు, మరికొంతమంది గవర్నరులుగా కూడా పెద్ద పదవుల్లోకి వచ్చారు.

ప్రభుత్వం మమ్మల్ని సవ్యంగా చూచేలా చేయడానికి జైల్లోవున్న మాలో చాలమందిమి కొంతకాలం నిరాహార దీక్ష వహించాం. మాలో శ్రీ భయంకరాచారి అనే ఆయన ఒకరున్నారు. ఈయన పేరుప్రతిష్ఠలు కలవాడు, ధైర్యవం

తుడు, స్వాతంత్ర్యయోధుడూను. ఒకసారి ఈయనకు అండమానుదీవుల్లో "ద్వీపాంతరవాసశిక్ష" విధించారు. వదలుతారా వదలండి లేదా చస్తాను - అని పట్టుబట్టి 1937 లో 60 రోజులపాటు బ్రహ్మాండమైన నిరహారదీక్ష పూనాడు, శ్రీభయంకరాచారి. తుదకు ఈయనదే విజయం! పాపం ఇంత కష్టపడి విడుదలైతే, తుదకీయన కళ్లు చెడిపోయాయి. ఏమాత్రం వెలుగుచూడలేని స్థితికొచ్చాయి ఆయన కళ్ళు. పైగా ఏమాత్రం ధ్వనినీ భరించలేని విధంగా చెవుడు వచ్చింది. పాపం, యింక జీవచ్ఛవంగా కాలం గడుపుతున్నాడు.

మేం నిరాహారదీక్ష పూనబోయేముందు ఆయనసలహా తీసుకున్నాం. ఈ పోరాటంలో విజయం సాధించాలంటే, ముందు ప్రజాభిప్రాయాన్ని సమీకరించాలన్నా కనీసం 20 రోజులు పడుతుంది. అలాగే మరో 5 రోజులు మధ్యవర్తిత్వం నెరపడానికి సరిపోతుంది. కాబట్టి విజయం సాధించాలంటే- 30 రోజులపాటు దీక్ష పూనటానికన్నా సన్నాహము వాలి అని మాకు హెచ్చరిక చేశారు.

పట్టువిడుపులు లేకుండా ఇంత దీర్ఘకాలంపాటు నిరాహారదీక్ష పూనడం ఏలాగా' అని మేము శ్రీభయంకరాచారిని అడిగాము.

కొద్దిగా ఉప్పుకలుపుకుని తాగినన్ని నీళ్ళు తాగమని ఆయన సలహాయిచ్చారు. అలాగే ప్రతిరోజు ఒకపర్యాయం 'ఎనీమా' చేసుకోమన్నారు. ఈ సలహాను పాటించాలని నిశ్చయించాం. సత్యాగ్రహం ప్రారంభమైంది.

కాని వింతవిషయమేమంటే, ఇన్ని సల్హాలిచ్చిన భయంకరాచారిగారు మాత్రం నీళ్ళు త్రాగడానికిగాని, ఎనీమా చేసుకోడానికి గాని నిరాకరించారు. ఒక మూడు, నాలుగురోజుల వ్యవధిలోనే ఆయన పరిస్థితి ఉక్కిరి బిక్కిరయ్యే స్థితికి వచ్చింది.

ఇండియన్ మెడికల్ సర్వీసుకు చెందిన జైల్ సూపరింటెండెంట్ మేజర్ 'గిల్' చాల సంస్కారంగల వ్యక్తి, మానవత్వం అంటే ఏమిటో తెలిసినవాడు. నిరహారదీక్షతో మేం పడుతున్న బాధను చూచి ఆయన సహించలేకపోయాడు. మాకు సాయం చేసేందుకు శతధా ప్రయత్నించాడు. భయంకరాచారి గారి వీరత్వాన్నిచూచినా, త్యాగనిరతిని చూచినా, ఆయనదేశభక్తి అంటేనూ 'గిల్'కు ఎంతో మహదానందంగా వుండేది. అందుకనే భయంకారాచారంటే ఆయన అంత ప్రత్యేక శ్రద్ధ వహించేవాడు. "కోర్కెల్ని అంగీకరించండి లేదా చంపెయ్యండి"- అంటూ భయంకరాచారిప్రభుత్వానికొక శ్రీముఖం పంపాడు. ఈయన వీరస్వర్గంపొందినా ఆత్మ ఔన్నత్యం ఇసుమంత్రైనా తరగబోదని 'గిల్' భావిస్తూవుండేవాడు. అందుచేతనే ఆయనమీద సాధ్యమైనంత తక్కువ ఒత్తిడి పెట్టడానికే గిల్ ప్రయత్నించాడు. 'స్ట్రెనెల్ మీద' ఒకసారి భయంకరాచారిని జైలు ఆస్పత్రికి తీసుకువెళ్ళి ముక్కుల్లోంచి రబ్బరుగొట్టం గుండా గొంతులోకి పాలు ఎక్కించడానికి ప్రయత్నించాడు. కాని భయంకరాచారి మాత్రం నిరాహారవ్రతంలో అందెవేసిన

చెయ్యి. ఎక్కించిన పాలన్నింటిని పుక్కిటపట్టి సూపరింటెండ్ చూస్తూవుండగానే 'ఫక్'ని వూసి వేశాడు.

'గిల్'కి కోపం వచ్చింది అదైనా ఒక నిమిషం మాత్రమే! కొంతసేపటికి నవ్వుతూ అన్నాడు! "భలేవాడివి భయంకరాచారి! నీమిత్రులపట్ల నీవిద్యుక్త ధర్మాన్ని నెర వేర్చావు. అందుకు నిన్ను అభినందిస్తున్నా. ఇంకిప్పుడు నా మనస్సంతృప్తికోసం నేను చేయాల్సింది చేస్తాను" భయం కరాచారిని తీసుకువెళ్ళి ముఖం క్రిందికి వాలి వుండేటట్లు ఆప రేషన్ టేబిల్‌కు కట్టి వుంచమని అనుచరులకు 'గిల్' ఆదేశ మిచ్చాడు. ఆ తర్వాత 'ఏనస్'గుండా పాలను ఎక్కించారు. ఆవిధంగా మనస్సంతృప్తిజెంది తమ ధర్మాన్ని తాము నెర వేర్చాంగదా అని ఉభయులు సంతృప్తి చెందారు.

కాని ఇతర సత్యాగ్రహులుమాత్రం సంతృప్తి చెంద లేదు. నిరహార దీక్షను యింకా కొనసాగిస్తూనే వున్నారు. దీక్ష ప్రారంభమైన 21 రోజుల తర్వాత (సరిగ్గా 21వ రోజున) ప్రభుత్వం సుప్రీంకోర్టు జడ్జీలలో ఒకరైన (శ్రీ) బచ్చు జగ న్నాథదాసును మధ్యవర్తిగా నియమించింది. సత్యాగ్రహుల కోర్కెలు అంగీకరించబడ్డాయి. సమ్మెను విరమించాం

